శ్రీరస్తు
శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# పెద్దబొబ్బిలిరాజుకథ




ప్రకాశకులు:
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్కు డిపో,
రాజమండ్రి.

1944

వెల రు. 0-12-0

శ్రీ రస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# పెద్ద బొబ్బిలిరాజు కథ

క. శ్రీకర రామా రామవర । భీకర దీనదయాళరక్షకా
సాగరమైన పాపముల । నమిదె దీర్చవె రామచంద్రకా॥
శ్రీగణనాథుని పాదము చెలువుగ సేవించి
శ్రీకరపద్మజురాణికి సొంపుగనే మ్రొక్కి
మందాగ హరిహరవాసుని ముద్దుగ సేవించి
వంతలేక గౌరీవాణుల పాదము సేవించి
వరకవులగు పెద్దలకును వందనమొసగి
వరుసతో బొబ్బిలిరాజుకథ వగతో జెప్పెదను

కథా ప్రారంభము.

వ. ఈ భరతఖండంబున ఆంధ్రదేశమందు విజయనగరమను పట్టణమేలుచున్న రాజశ్రీ రామరాజుగారికన్న పైదేశమున బొబ్బిలి అను పేరువహించిన పురమునకు అధిపతియగు రాజశ్రీ రంగారావు గారికిని కోళ్ళమాన్సైన్యముచె జరిగిన ప్రళయకలహము.

బొబ్బిలికోట పాలించేటివాడు రంగారావుగారు
విజయనగరము పాలించేవాడు విజయరామరాజు
పేరుజెందిన సర్దారయ్యా ప్రభురంగారావు
నీతులయందున విదురునిబోలుగున నీగుగలవారయ్యా
నిప్పుయందున సింహామరిలుంది రంగారాయుడికి
అరిపాదంబున దామరరేఖ రంగారాయుడికి
రాజచిహ్నాలు గలిగినవాడయ్యా రంగారాయుడు
వస్తాదిబిడ్డగా యున్నాడయ్యా రంగారాయుడు
రంగరాయుడుతమ్ముడు వెంగళరాయుడు
కార్యమనగా ముందుకువత్తుడు వెంగళరాయుడు
వెంగళరాయుడు బావమరది పాపారాయుడు
పాపారాయుడని పేరుజెప్పగా ..

పసిపిల్లబాలాడిగా పాంబ్రాగరండి
గోగ్గు లేకనే యున్నాడయ్యా బొబ్బిలికోటలో
కోటలకంతయు కోంసి నాయు పాపారాయుడు
రంగా రాయుడు బావమరది ధర్మారాయుడు
బొబ్బిలికోట యేలుతున్నాడు రంగారాయుడు
యెదురు లేకనే బొబ్బిలికోట యేలుతున్నాడు

వ. బొబ్బిలిరాజుగారికి అరికాలులయందు పద్మరేఖయు చేతుల కమలదళంబును పోపున విజానురేఖయును, కన్నులమచ్చయు, కపోలమున కనకమణియు, గలిగి విదురునివలె నీతిమంతుడై యెదురులేని శౌర్యము గలిగి పరాక్రముండగు వెంగళరాయుడనే తమ్మునితో సతనిబావ మరిదియగు పాపారాయుడును తన బావమరదియగు ధర్మారాయుడును గూడి శౌర్యములుమీరి యుద్ధములుకోరి బొబ్బిలియందు నివసించుచున్న వారలు.

విజయనగరము యేలేటివాడు విజయరామరాజు
కిరీట ధారులయ్యా విజయరామరాజు
ఆలోచనకు దొడ్డవాడయ్యా విజయరామరాజు
యొక్కటినమును వొక్కసమ నాబుని విజయరామరాజు
కొలువుకీదా యున్నాడెను విజయరామరాజు
తన్నుకొలిచెడి రాజులంతయు తాను పిలచినాడు
అన్నలార తమ్ములారా నా యన్నలార రండు
భూమియందున గొప్పపందెము మేము యాడితిమి
కోడిపందెము కొరవైయున్నది యన్నలార యిపుడు
కోడిపందెము ఆడను యిపుడు మనసుబుట్టెనయ్యా
పేరుజెందిన సరదారిపందెము కోడిపందెమయ్యా
నాతో సరిగా కోడిపందెము యెవ్వరాడుతారు
యిలాగున ఆలోచించను విజయరామరాజు
అచ్చోటనే యున్నాడయ్యా ఆనందరాజు
అప్పుడేమని చెప్పినాడయ్యా ఆనందరాజు
చిన్నమనవి చిత్తగించుము సిన్నయ్యా దొరగారు

మీకుసరిగా పందెములాడు వెంగళరాయుడు
ఇట్టిమాటలు చెప్పినాడయ్యా ఆనందరాజు
అప్పుడేమని చెప్పినాడయ్యా విజయరామరాజు
వెంగళరాయుడికి జాబును వ్రాయసాగెనయ్యా

వ. ఇట్లుండగ విజయనగరమేలేవాడు విజయరామరాజుగారు తొమ్మిదిలక్షల సైన్యములతో రత్నకిరీటములతో సౌదాసోపానసింహాసనములతో పచ్చగతోరణములతో ఆలోచనసభలతో ఆనందరాజు ప్రభువులతో నిండుకొలువున్నాడు నొక్కనాడు సమీపమునయున్న సేనాపతులంగాంచి మంచిపందెమిడి జయమువహించితిమి. కోళ్ళ పందెమునుచూడ ఆశించియున్నాడని నాతో సమానముగ పందెమాడువా రెవరనియడిగిన ఆనందరాజు చేతులు ముకుళించి శిరముపైనిడి ఓస్వామీ బొబ్బిలినుండును వెంగళరాయుడను రాజు తమతో తమబలంబున పందెములు కొప్పునని చెప్పినమాత్రమున సంతుష్టిజెంది వెంటనే జాబువ్రాయ నుద్యుక్తుడాయెను.

పరాకుంచక వినండిమీరు వెంగళరాయుండు
చిన్నమనవిదా చిత్తగించుము వెంగళరాయుడు
కోడిపందెము యాడను యిప్పుడు యిచ్చులుగొన్నాను
కోడిపందెము ఆడుతామయ్యా వెంగళరాయుండా
విజయనగరము బొబ్బిలి మొల్లసంధాన యిప్పుడుదా
డేరాలు యిచట వేయించవలెను వెంగళరాయుడా
గురువారమందె వచ్చెదమేము యెల్లసదరు కేదా
చుట్టుప్రక్కల కోళ్ళనుగోజా తయారు జేసుకొని
గురువారమందె వచ్చెదమేము యెల్లసదరుకుదా
చుట్టుప్రక్కల కోళ్ళనురాజా తయారుచేసుకొని
గురువారమందు చేరవలెనయ్యా యెల్లసదరుకుదా
నాతాలూకా యందుండు గోళ్ళనంతయు తెప్పించుతాను
కోడిపందెము ఆడి మనము తమాషజూస్తామా
మీకుగెలిచితే కీర్తిపేరు మీకే గలుగూను
మేము గెలిచితే కీర్తిపేరు మాకేగలుగూను

ముందు వెనుక చూడవద్దయ్యా వెంగళరాయుడా
ఈరీతిగా వ్రాసినాడయ్యా జాబులు అపుడుదా
లకోటచేత బంధించినాడు రాజు అపుడుదా
హర్కారులచేత యపుడు యిచ్చెను జాబూను
జాబుయిపుడు బొబ్బిలికి చేరవలెనయ్యా
రంగారాయుడు వెంగళరాయుడు చేతికివ్వాండి
మరల వుత్తరవుకొనిరండయ్యా హర్కారులు మీరు

వ. బొబ్బిలిదొరయగు వెంగళరావుగారికి రంగారావుగారికి వ్రాయునది యేమనగా, కోడిపందెములాడుటకై నాగపురము వెలుపల డేరాలు వేయించి యున్నాను మాంతరపునయున్న చుట్టుపట్టు జమీనుల కోళ్లనున్న తెప్పించుచున్నాము అట్లే తామున్న తమచుట్టుపట్ల గల కోడీలను బృహస్పతివారము వుదయమునను తప్పకవచ్చి కోళ్ళ పందెముల తమాషాలజూచి కీర్తులువహించెదముగాన అవశ్యముగ రా కోరెదను అని జాబు వ్రాసి హర్కారులచేతికిచ్చి బదులు తెమ్మని బొబ్బిలికి పంపించెను.

జాబులెత్తుకొని వస్తువున్నారు హర్కారులయితేను
బొబ్బిలివారి దేవిడికాడికి టుకోమైనారు
పారాహద్దున నిలచినారయ్యా హర్కారులపుడు
యెవ్వరియొక్క పారాయన్నారు పారాచౌకీలు
రాజుగారి తాలూకావని వారు చెప్పినారు
రాజుగారి జాబులు మేము తెచ్చియున్నాము
పారాలయ్యా బాటలు విడవండి మేము పోవుటకు
వెంగళరాయుడు బేటికిపోయి పలుకుము తెస్తాము
గడియసేపుదా నిదానించండి హర్కారులు మీరు
యచటనుండి వచ్చినారయ్యా పారాచౌకీలు
రంగారాయుడు ముందరగవచ్చి వందనమొసగిరీ
పరాకులేక వినుము యిపుడు రంగయ్యాదొరగారు
మీదు పేరిట జాబులు యిపుడే దేవిడికొచ్చెను
రమ్మనిచెప్పితె పంపెదమయ్యా రంగాదొరగారు

హాహనుచి యపుడు సెలవుయిచ్చెను రంగారాయుడు
యచటనుండి వచ్చినారయ్యా హారాచౌకీలు
రంగారాయుడి బేటి కూడను వస్తూవున్నారు
రంగారాయుడు సుంకో వచ్చి నిలచినాడయ్యా
వందనమయ్యా వందనమయ్యా రంగయ్యదొరగారు
వందనమొసంగి జాబులందిచ్చి కొలువున యపుడుదా

వ. అంత హర్కారులు జాబు నెత్తుకొని కోటవాకిట నిలచి రంగా రావుగారు త్తరువు పొంది లోపలికిపోయి రంగారావుగారికి నమస్కరించి వుత్తరము చేతికిచ్చి నిలచిరి.

లకోటవిప్పి జాబు చదివినాడు రంగారావుదా
జాబునయుండె సంగతులంతా కన్నులచూసేను
తనలోతాను నవ్వుచున్నాడు రంగయ్యదొరగారు
వెంగళరాయుని ముఖముజూచి నవ్వసాగెను
పరాకుంచక వినుము యిపుడు వెంగళరాయుడా
మీాపేరిటనే జాబువ్రాసినారు రాజుగారు
జాబునయుండు సంగతుల తయు కన్నులచూడండి
ఇట్లుచెప్పుచూ జాబునుయిచ్చెను చేతికి యపుడుదా
జాబునప్పుడు కన్నులచూచేను వెంగళరాయుడు
వుత్తరం యపుడు వ్రాయసాగెను వెంగళరాయుడు
పరాకుంచక వినుము యిపుడు నిజము రాజా
మీారుపంపిన జాబువచ్చెను మాకు యిపుడుగా
జాబునయుండు సంగతులతో కన్నులచూచినాను
గురువారమే వస్తువున్నాము మన్నెంమీాదకి
మన్నెంమీాదికి మీారు రావలెను రాజుదొరలంతా
ఇన్నివిధములుగా వ్రాసినారయ్యా జాబులో యపుడుదా
జాబువ్రాసిదా హర్కారులచేతిలో యపుడుయిచ్చెను
జాబులెత్తుకొని వస్తువున్నారు హర్కారు లపుడుదా
జాబులోని సంగతులంతయు కన్నులజూచేరు
తనతాలూకాకు జాబులు యపుడు వ్రాస్తున్నారు

డబ్బైయేడు పాలెగాండ్లకు జాబులు వ్రాసేనూ

వ. రంగారావుగారు జాబువిప్పిచూచి వెంగళరాజువద్దకివచ్చి ఒం డొరులు చిరునవ్వునవ్వుచును వెంగళరాజుగారు బదులు త్వరను వ్రాస్తు యేమనగా, రాజరాజున విజయరామరాజుగారికి వ్రాయునది తాము వ్రాసినజాబుచూచినాము మీయిష్టప్రకారం మన్నెంమీదికి మా కోళ్ళను మాతోచేరినవారి చుట్టుపక్కలకోళ్ళతో గురువారం వుదయ మున వచ్చి చేరుతున్నాము అని బదులు జాబు వ్రాసియిచ్చిరి. ఆ జాబునెత్తుకొని, హర్కారులు విజయరామరాజుగారికి వినయవందన ములుజేసి జాబు చేతికిచ్చి నిలిచిరి.

బొబ్బిలివారిపై కోడిపందెమునకు పోవుచున్నాము
రాణువలంతయు [illegible]వలెనయ్యా కోడిపందెముకూ
వింతవింత లక్షకోడిలు జాబుకు తెప్పించండి
ఈలాగున వ్రాసినాడయ్యా జాబులు యప్పుడుదా
మంచివన్నెల కోడెపియాంతెల బట్టుతున్నారూ
శుద్ధ నెమలికోళ్ళను యప్పుడు తయారు చేసిరి
డేగవన్నెపుకోళ్ళను యప్పుడు తయారు చేసిరి
మంచిమంచికోళ్ళను యిప్పుడు తయారుచేసిరి
విజయనగరము తెచ్చినారు కోళ్ళను యప్పుడూదా
యేదోప్రక్క జూచిన కోళ్ళుయున్నది యప్పుడైతేనూ
గిలగిలయని నవ్వినాడయ్యా విజయరామరాజు
మంచిమంచి కోళ్ళను యప్పుడు తయారు జేస్తిమూ
తామసమేమి మన్నెంమీదికి తయారుగరండీ
యీవిధంబుగా పలికినాడు రాణువలంతాను
యీరీతిగా యున్నాడయ్యా విజయనగరమందూ
బొబ్బిలియందు యెట్లున్నాడు రంగరాయదొరగారూ
తనతాలూకాకు జాబులు యప్పుడు వ్రాస్తుయున్నారు

వ. అపుడు విజయరామరాజుగారు పలకోటపెచ్చిచూచి చుట్టుపక్కల యున్న పాలెగాండ్లయిండ్లనుంచి వన్నెలకోడెలతో తయారుగారమ్మని ఆజ్ఞాపించగానే వారుడగిపంపుచు తయారై పెద్దకోళ్ళతో విజయనగరం

మన్నెంమీదికిరాగానే రాజుగారునుచూచి తయారైయుండిరి.

డబ్బైయేడు పుణ్యాదారులకు జాబుల్వ్రాసిరీ
అన్నలార తమ్ములారం మాయన్నలార యపుడు
కోడిపందెము వొప్పిమేము పోతూవున్నాము
కోడిపందెమున గావలెనయ్యా యల్మాదొరలుదా
మంచిమంచి కోడీలంతా తయారుచేసుకొని
విన్న వేగము యందరుయపుడు బేటికిరన్నండి
యీ రీతిగా వ్రాసినాడయ్యా జాబులు యపుడుదా
హర్కారుల యపుడు బిలచెనయ్యా బేటికిముందుగా
జాబుయెత్తిదా చేతికిచ్చె రంగయ్యదొరగారూ
హర్కారులపుడు జాబులెత్తి నడవసాగిరి
వారివారిజాబులు యపుడు వారికిచ్చిరీ
జాబులుచూచి సంతోషపడ్డారు యలమాదొరలూదా
మంచిదన్నారు బాగన్నారు రాణువులంతానూ
వింతవింత కోళ్ళను యపుడు పట్టుతుయున్నారు
పేరుయెత్తినకోళ్ళను యపుడు బట్టుతుయున్నారు
కోళ్ళనంతయు తయారుచేసిరి యలమదొరదా
వెంగళరాయుడు బేటికివచ్చి వందన మొసగిరీ
ఆజ్ఞప్రకారము గోళ్ళను యపుడు తయారుచేస్తిమీ
మంచిమంచి గోళ్ళను యపుడు తయారుచేస్తిమీ
తామసమేమి మన్నెంమీదికి త్వరలోరన్నండీ
యీలాగు చెప్పినారయ్యా రాణువలంతానూ
మంచిదన్నాడు అప్పుడుమాట వెంగళరాయూడూ
కాసాకోళ్ళను తెమ్మన్నాడు వెంగళరాయూడూ
సాదరిగోళ్ళను తెమ్మన్నాడూ వెంగళరాయూడూ
గోళ్ళనుయపుడు శృంగారించెను వెంగళరాయుండు
బంగారుతోను అందెలు యపుడు గోళ్ళాకూ

బొబ్బిలియందు రంగారావుగారు హర్కారులనుపిలిచి డెబ్బది యేడుపాళములకు జాబులు యిచ్చి పందెమునకు జయము పొందిన మంచివన్నెకోళ్ళతో వేగరమ్మని ఆజ్ఞపంపెను. అంత యెలమాదొర

లంతా సంతోషించి పేరువహించిన గోళ్ళనుబట్టి వెంగళరాయుని
కెదుట నిలిపి నమస్కరించి శీఘ్రముగా మన్నెంమీదికిరమ్మనిపిలిచిరి.

సొగసైనట్టి పట్టుకుచ్చులు గట్టెను గోళ్ళకు
యీరీతిగా శృంగారించెను గోళ్ళను యప్పుడూండా
వస్త్రాదిగోళ్ళను తయారుజేసెను వెంగళరాయుండూ
గోడిపూజల తయారుచేసెను వెంగళరాయుండూ
అన్నగారి భేటికివచ్చెను వెంగళరాయుండూ
పరాకుంచక వినండిమీరు రంగయ్యదొరగారూ
తామసమేమి మన్నెంమీదికి తయారుగరన్నండి
యీరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుండూ
మంచిదన్నాడు అట్టివేళలో రంగయ్యదొరగారూ
బావమరిది పిలిపించినాడు రంగయ్యగారూ
పాపారాయుణ్ని పిలిపించినాడు యట్టివేళాలో
అన్నదమ్ములు బావమరదులు యిందరువెడలిరి
వారివారి రాణువలంతయు వెంటనే వెడలిరి
బావమరది భేటికివచ్చి వాదనమొసగిరి
పరాకుంచక వినండిమీరు పాపారాయుండూ
యింకతామస మేమున్నాదు పాపారాయుండూ.
అక్కడనుంచి ప్రయాణమైరి రంగయ్యదొరగారూ
నన్నుకొలిచె రాణువలంతాను వెంటనేవెడలిరి
విజయనగరము యెల్లసరదుకేదా
యెల్లసరదుకు వచ్చిచేరిరి బొబ్బిలిదొరలుదా
డేరాయప్పుడు వేసినాడయ్యా వెంగళరాయుండు
డేరాలోపల కొలువు తీరిరి బొబ్బిలిదొరలుదా
అన్నదమ్ములు బావమరదులు కొలువుతీరినారూ
అచ్చట చల్వపందిళ్లు వేసిరి కోళ్ళకు యప్పుడూండా
రాజువారి గాంటలు యెప్పుడు చూస్తున్నారు

వ. నిలువగానే వెంగళరాయుండు సంతోషించి కోళ్ళకుబంగారు
అందెలుకట్టించి పట్టుకుచ్చులు వేయించి రంగయ్యదొరగారైన అన్న
గారిసముఖమునకువచ్చి శీఘ్రముతయారుగమ్మని వేడగా నాదుభావ

మఱిదియగు పాపారాయుణ్ణి వెంటబెట్టుకొని తన్ను రాణువలంత గొలువగ అతిఆర్భాటమున జయజయమని ఘోషలుతో బొబ్బిలి దొరలు విజయనగర గోటయెల్లలో సరదారులంతా జేరి తమ్ముడు బావమరుదులతో కొలువుదీరి డేరాలలో దిగిరి.

యిక్కడికథలు యీ లాగున్నప్పుడు యెల్లసదరులోనా
విజయరామరాజు వెడలెను అట్టిసమయమందూ
తన్నుగొలచేటి రాణువలంతయు అపుడు వెడలినారూ
బొబ్బిలివారి యెల్లసదరుకైనా డాకలైనారూ
రాజుగారి యెల్లయందు డేరావేసినారూ
గోళ్ళకు యపుడు పందిళ్ళయినా గొబ్బునవేసినారూ
కుర్చీవేసి కొలువుతీరెను విజయరామరాజు
డేరావిడిచి బైటికి వచ్చిరి బొబ్బిలిదొరలూదా
రాజుగారును బొబ్బిలివారును బేటీయైనారూ
అక్కడ జోడీకుర్చీలు వేసినారు యపుడు
కుర్చీమీద కొలువుదీరెను రంగయ్యదొరగారూ
ఇచ్చకుర్చీయందు కొలువు తీరెను వెంగళరాయుండూ
రంగయ్య దొరగారు రాజుగారున్ను కౌగలింపు లాయెను
వెంబడియున్న యెల్లాందొరలతో యేమని చెప్పెను
ముందుగ యిపుడు మీరేనయ్య కోళ్ళనుదించండి
మంచిదన్నారు బాగన్నారు యెల్లాందొరలూహా
ప్రొద్దుప్రొద్దున కోళ్ళను అపుడు దించుతున్నారూ
యెత్తుడుకోళ్ళు దింపుడుకోళ్ళు తయారు చేసిరి
కోడిపందెము సెలవిచ్చినారు రంగయ్యదొరగారూ
రాజుగారిని అపుడు జూచిరి రాణువలంతాను
రాజుగారును సెలవు యిచ్చెను పందెమునకుదా
మంచికోళ్ళను దింపించినారు సేవకులైతేను
వారివారికోళ్ళకు అపుడు కత్తులు కట్టిరి
కోళ్ళను విడిచి అట్టివేళలో లడాయి పెట్టిరి
కలకలమని కొక్కరించెను కోళ్ళయపుడూదా

యెగిరిలాగెను బొబ్బిలికోడి యోజనపొడుగూనా
యెగిరియెగిరి నెత్తియాందు టాకుగపొడిచేను
గిరగిరగిరగిరమాని భ్రామిపడేను రాజుగారికోడి
అప్పుడెట్లా వున్నాడయ్యా బొబ్బిలికోడైతే
కాలుబిగువున పదికోళ్ళను యప్పుడు కాలునజంపేను
కొక్కరించి కూతవేసెను కోడియప్పుడూదా
కూతవేసి గోళ్ళమీదికి దూకుతువున్నాది
యెక్కడ కోళ్ళను చేరనివ్వక తరుముతు యున్నాది
గాయముతగిలినకోళ్ళను కట్టివిప్పుతున్నారు
రెండవకోళ్ళను యప్పుడు రాజుదింపినాడు
తయారుపరచి పడిచినారయ్యా కోళ్ళనుయప్పుడుదా
కేకలప్పుడు విన్నాడయ్యా బొబ్బిలికోడీదా
యెక్కడిలేని కోపముగలిగెను బారాకోడీదా
వచ్చినంతనే కన్నుంచూచెను కోళ్ళనప్పుడూదా
రెక్కయాడు తట్టినించెను బారాకోడీదా
కోళ్ళమీదికి దూకెనయ్యా బారాకోడీదా
కూతలువేసిన కోళ్ళను అప్పుడు కొక్కిరించింపె
ముక్కునకాలున పొడిచించెను బారాకోడీదా
రెక్కలచాటున అదిమిపట్టెను బారాకోడీదా
కాళ్ళెన్ని గొంతులుగోసెను బారాకోడీదా
యెత్తుదింపుడు కోళ్ళను యప్పుడు చంపివేసినాది
రాజుగారి కోళ్ళన్నింటా హతమైపోయేనూ
యింతవరకు దెబ్బలేదయ్యా బొబ్బిలికోడికి
పేరుజెందిన సరదారగోడి బొబ్బిలికోడైనా
అచ్చటయున్న కోళ్ళనంత విడిపించినారయ్యా
అన్నికోళ్ళను తరిమిజంపె బొబ్బిలికోడైతే
ఇంతలోకి యేమన్నాడు విజయరామరాజు
పరాకుంచ వినండిమీరు వెంగళరాయుండా
కాసాకోళ్ళను విడిపించెదను వెంగళరాయుడా

యీరీతిగా చెప్పినాడయ్యా విజయరామరాజు
అప్పుడేమని పలికినాడయ్యా వెంగళరాయుడూ
దగ్గరయున్న సేవకులతో యేమనిచెప్పెను
మంచికోళ్ళను దింపించండి విజయరామరాజు
దాగ నెమిలి పొడికోళ్ళరాజా తాయిగ తెన్నండి
ఈరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుండు
మంచిదన్నారు అట్టివేళలో సేవకులయితేను
తెచ్చినకోళ్ళను కన్నులచూచెను వెంగళరాయుడూ
కత్తులయపుడు కాళ్ళకుగట్టిరి కోళ్ళకయినాను
గోడినియపుడు కవరించినాడు వెంగళరాయుడూ
పరాకుంచక వినుమయిపుడు బారాకోడిదా
మన్నెంమీదికి యెల్లసదరులో కీర్తితెన్నండి
యెన్నికోళ్ళను పేరెత్తినావు బారాకోడిదా
నీసమానము చూడవలెను బారాకోడిరా
నీకంబలము చూడవలెను లడాయిలోగాను
జంటకోడి ఆయుధంబున భూమినపడేగా
నీమకాని ఆయుధంబున భూమినపడవలెనూ
పేరుకీర్తులే తేవలనయ్యా బారాకోడిదా
ఇట్లుచెప్పి దువ్వినాడయ్యా బారాకోడిదా
మంచిగోళ్ళు తెప్పించినాడయ్యా విజయరామరాజు
రాజుగారి కోడినియపుడు పందెముగదింపిరి
రాజుగారికోడిని చూచెను వెంగళరాయుడూ
తనకోడిని సవరించి టాయిగ విడిచెను
రెండుకోళ్ళను అట్టివేళలో తాయిగదింపిరి
దింపుడుకోడిని కన్నులచూచును బారాగోడైతే
దగ్గిదగ్గి వస్తున్నాది బారాకోడైతే
జగ్గివచ్చె రాయుడికోడిని కన్నులచూచేనూ
యెగిరినాదిర బొబ్బిలికోడి యోజనపొడుగూన
దుమికినాదిర బొబ్బిలికోడి దుమ్ములు యెగరగను

రాజుకోడికి రాయుడికోడికి కలపటమైనాది
యెగిరినకోడిని కన్నులచూచెను రాజుగారికోడి
యెగిరినయొక్క రాయుడుకోడి భూమికివొగ్గేను
రాయుడుకోడికి బలములేకాగా చంపడానికి
తొలిదెబ్బ తప్పించుకొన్నాది రాజుగారికోడి
రెండవమారి కలపటమాయె బొబ్బిలికోడిపై
రెక్కలుయప్పుడు తట్టిపిలిచెను రాయుడుకోడిదా
పొంచిపొంచి బొబ్బిలికోడి గుంపుంగోదూరెను
రెక్కలతోను తట్టిందిరా బారాంగోళ్ళను
కొండెపట్టిదా నేలకువంచె బారాగోళ్ళను
కొండెపట్టిదా నేలకువంచె బారాగోళ్ళనుదా
పేగులుకంతలు నేలబడ్డది కోళ్ళకుయప్పుడుదా
గిరగిరగిరగిరగిరగిరగిర భూమినపడ్డది
వంగివంగి రాయుడికోడి వస్తూవున్నది
తొక్కరించి పిలిచినప్పుడు కూతలుపట్టెనుం
యెత్తుకుదింపుడు గోళ్ళనుయప్పుడు చాపుతుయున్నాది
అప్పుడెట్లా యున్నాడయ్యా నిజ మగ రాము రాజు
బొబ్బిలివారికోడి యప్పుడు కన్నులచూసేను
యక్కడలేని గోపముపొందె రాజుగారుయప్పుడు
కుడిమీసము మురికినాడయ్యా గుడ్లెర్రజేసి
గోపముచేత దేహమునురచి యేమని చెప్పేమా
అన్నలార తమ్ములార మాయనున్నలాగ రండు
దింపుకుగోళ్ళను తెమ్మనిచెప్పెను యాట్టిసమయమందు
తెచ్చినగోడిని కన్నులచూచెను రాజుగారు యపుడు
అప్పుడెట్లా వున్నాడయ్యా పాపారాయుండు
వెంగళరాయుని ముఖముజూచి ఘల్లున నవ్వేనూ
చదురుదిగ్గున లేచినాడయ్యా పాపారాయుండు
నాదుపేరిట గోడిపందెము నేను పెట్టుతాను
ఘడియసేపుదా నిదానించెను వెంగళరాయుండు

యీవిధంబుగా పలికినాడయ్యా పాపారాయుండు
యింతలోపల కాసాగోళ్ళను రాయిగతెచ్చిరి
తెచ్చినయొక్క గోళ్ళరాజు కన్నులజూచేను
కాకివంటి గోడినిబట్టి పాపారాయుండు
బంగారంపు అందెలుయపుడు కాళ్ళనువేసేను
చెక్కిలిదువ్వి ముద్దలాడినాడు పాపారాయుండు
ముందువెనక జూడవద్దు బారాకోడీదా
మన్నెంమీదున మెప్పుసదసులోన కీర్తితెన్నండి
ఇప్పుటవచ్చినవారికి చాలా నీరస్వర్గమూ
చావంటె మీరుభయపడవద్దు బారాకోడీదా
యెన్నాళ్ళుబ్రతికిన చావుసిద్ధమె బారాకోడీదా
బొబ్బిలియందు పుట్టినావురా బారాకోడీదా
బొబ్బిలివారికి యిపుడునీవు కీర్తితెన్నండి
యీరీతిగా పలికినాడయ్యా పాపారాయుండు
రాజుగారికోడిని యపుడు ముందుగ విడిచిరి
రాజుగారి కోడిమీదనే పాపారాయుడు
తనయొక్క కోడిని విడిపించినాడు
రెక్కలుయపుడు తట్టినాదిరా రాయుడుకోడీదా
రాజుగారికోడిని యపుడు కన్నుల చూచింది
యెగిరినాదిగా రాయుడికోడి యోజనపొడుగూన
యెగిరియెగిరి గిరగిరతిరిగి భూమినపడ్డాది
రాజుతనకోడి మరణము కన్నులచూచేను
యెక్కడలేని కోపమువచ్చె రాజుగారికపుడు

—♦ రెండవసారి కోళ్ళజగడము ♦—

యెత్తుడు దింపుడుళకోళ్ళనురాజా వేయించినాడూ
వచ్చేటికోళ్ళను కన్నులజూచెను బారాకోడీదా
యెగిరియెగిరి యిరువై ముప్పై కోళ్ళను జంపేను
దూకినదూకున ముప్పై నలుబై కోళ్ళనుజంపెను
కోళ్ళకిందికి చారదీసెను బారాకోళ్ళాను

వక్క-కాళితో తొక్కిన కాలికత్తితో గొంతులుకోసేను
రెక్క-లయినా తాటి చినాదిరాం రాముడు కోడేమీ
రెక్క-లుక్రిందా కొంత కోళ్ళగా హతమైపోయినాది
యేతట్లు జూచినగాని కోడిపుంజు లేమి
యెగిరితన్ని కోళ్ళను యప్పుడు రాయిగ చంపేను
మన్నెంవిడిచి వెళ్ళినాదిరా రాజుగారికోడి
పిల్వపిల్వ తిరిగిజూడక పారి[illegible]నాది
కోళ్ళతరిమి రాయుడికోడి చేతి వచ్చేను
చెక్క-లిదువ్వి ముద్దులాడి చేతను యెత్తేను
సేవకుల చేతికిచ్చేను బొంగ్రోడీని
అప్పుడెట్లా వున్నాడయ్యా పాపారాయుడు
వెంగళరాయుడు రంగారాయుడు ముఖముజూచినవ్వ
బొబ్బిలివారు గెల్చినారు రాజు వోడినారు
అప్పుడెట్లా వున్నాడయ్యా విజయరామరాజు
బొబ్బిలివారి ముఖము జూచి విజయరామరాజు
పాపారాయుని వెంగళరాయుని ముఖము జూచినాడు
ముసిముసి నవ్వులు నవ్వుకొన్నారు బావమరదూలూ
యెక్క-డలేని కోపమువచ్చె రాజుగారికపుడు
మంచిదన్నాడు బాగన్నాడు విజయరామరాజు
అక్క-డవుండే డేరాలంత కట్టివేసినారూ
విజయనగరము వచ్చిచేరెను విజయరామరాజు
కొలువచావిడిలో కొలువైనాడూ వి॥
ఆలోచన చేస్తున్నాడయ్యా వి॥
వక్క-పెళ్ళతాలో లేపించవలెను బొబ్బిలికోటాలూ
ఇట్లురాజుగారికి కోపము అయితే మనస్సున వున్నాది
వీరికథలు యీలాగున వున్నది విజయనగరమందు
మన్నెంమీదికి వచ్చినారుగా బొబ్బిలి దొరలేమీ
అన్నతమ్ములు బావమరదులు బొబ్బిలిచేరిరి
వీరికథలు యీలాగున వున్నది బొబ్బిలికోటలో

జాబులు కొద్దిరోజులు కాలము జరిగిన తరువాత
వక్కనాటి కాలమందున
పుదుచ్చేరి యేలేటివాడు ఫ్రాంశీలబూచి
గోల్కొండ నబాబుదగ్గర పరవానం నేలు
కళింగరాజ్య కటకందాక పాచ్ఛాకములాయె
సీకాకొళమే సింధుకడియాయె పాచ్ఛాకములాయె
గోల్కొండకు ప్రయాణమాయె ఫ్రాంచిదొరగారు
వొంటెలమీద పైకం యెత్తుకొని
తనముంద మార్బలం రాజా వెంటతీసుకొని
ముందుగుండు సామానులతోటి ప్రయాణమాయెను
లక్షాడబ్బైనాలుగువేల దళములతో ప్రయాణమాయెను
హైదరుజంగు అనేటివాని వెంటదీసుకొని
లాల్ఖానుడు అనేటివాణ్ని వెంటతీసుకొని
మందుగుండు సరిదారులతోటి ప్రయాణమాయెను
గోల్కొండకు వచ్చిచేరిరిగా ఫ్రాంచిదొరగారూ
గోల్కొండలో దుర్గామిట్టలో డేరా వేయించి
మొండలాకు యెత్తించినారు యెఱ్ఱపట్టుడేరా
సీడలాకు యెత్తించినారు సిలిపట్టుడేరా
మంచులాకు యెత్తించినారు మైనపులండీలు
రామసందు డేరాలోగా కొలువుతీరినారూ
గోల్కొండ పాచ్ఛాపుకు రాజా వరదీ బంజాను
గోల్కొండ జమూబందికి మేమే వస్తిమి
మీలెక్కపక్కలు జమాబందికి రాయిగ జూడండి
ఈవిధమున వరదీచాలా రాయిగ పంపాను
మంచిది మరిబాగాన్నాడు పాచ్ఛాపుదొరలు
లెక్కపక్కలు జమాబందిని జూస్తున్నారు
లక్షాపైకము చెల్లించెను ఫ్రాంచిదొరగారు
అప్పుడేమని పలికినాడుగ ఫ్రాంచి దొరగారు
ఫ్రాంచిగారికి పాచ్ఛాపును రాయితీ వున్నాది

ఆతరహాగా వుండేసమయమందున ఫ్రాంచిదొరగారు
సంధిచేసుక మనవిచేసెర ఫ్రాంచిదొరగారు
పరాకులేక వినండిమీరు పాచ్చావు దొరలు
తూర్పుదేశం చూడను నాకు వాంఛాయున్నది
తూర్పుదేశం జూచి నేను పుదుచ్చేరికేమి
పుదుచ్చేరయినా చేరుతానుగా పాచ్చావు దొరలు
ఈవిధంబున మనవిచేసెను బూచి దొరగారు
బూచి మాటలు విన్నారండి పాచ్చావుదొరలు
చాలించు చాలించు వోయి బూంచి దొరగారు
తూర్పుదేశం కర్నాటను చాలావున్నాది
కర్నాటక పాచ్చావులు నిన్ను ఆటకాయించెను
కానిపోని మాటలవల్ల కలహం పుట్టును
పుదుచ్చేరికి పొమ్మన్నాడండి బూచి బొరగారూ
ఈవిధంబున పలికినాడుగా పాచ్చావు దొరలు
అప్పుడుయేమని పలికినాడుగా బూచి దొరగారూ
అంతమాట శెలవివ్వావద్దు పాచ్చావు దొరలు
మీతాలూకాకు మద్దత్తయిన తాయిగ పంపండి
ఈవిధంబుగా పలికినాడుగా బూచి దొరగారు
గొప్పగొప్ప వుల్కాయలే సదరు పెట్టినారు
బూచిగారి వుల్కాయలకే సంతోషపడినారు
మంచిది మాబాగన్నాడండి పాచ్చావు దొరలు
అయినా నమ్మవద్దుర నమ్మరాదుర ఫ్రాంచివారిని
బందరును మరికాపురస్తుడు దుబాసి లక్ష్మడు
కాకితంబు కలంపుల్లగా చేతబట్టినాడు
దుబాసివారి లక్షుమయ్యకే జాబులు వ్రాసేనూ
విన్నదివేగం కన్నదిశీఘ్రుం దుబాసి లక్షుమయ్య
జాబు జూచిన తక్షణమున నాబేటికి రన్నండి
గోల్కొండకే చేరవలెనుగా దుబాసి లక్ష్మడా
ఈవిధంబున జాబులు వ్రాసి తయారు చేసేను

హారాక ఖిల్లా చేతికిచ్చెను జాబుకమ్మలేమి
బందరుకైన ఫంగినాషగా పాచ్చాపు దొరలు
దుబాసివారి లక్షుమయ్యనో బేటికి వచ్చిరి
నిండుకొలువున జాబులుప్పించి దండం బెట్టిరి
లకోటాలు విరిచించినాడు జాబు చదివినాడు
జాబులోని వర్తమానము కన్నులజూచెను
గోల్కొండకే బయలుదేరా దుబాసి లక్షుమయ్య
పాచ్చాపుల బేటికివచ్చి సలాం చేసెను
బైటో అనగా నిండుకొలువున కొలువు తీరినాడు
జాబుకైన మళ్ళినాడు దుబాసి లక్షుమయ్య
నన్ను పిలిపించిన కారణమేమి పాచ్చాపుదొరలు
పరాకులేక వినండిమీరు దుబాసి లక్షుమయ్య
తూర్పు దేశం చూడను బూచి వస్తువున్నాడు
మందగుండు సామానులతోటి బూంచివస్తాడు
అక్కడ జల్దికార్యములు జరగకుండా తీసుకపొమ్మండి
యెదురు బేటిక రమ్మనిచాలా జాబులు వ్రాసేనూ
తూర్పుదేశం కర్నాటకముగా చాలావున్నది
కర్నాటక పాచ్చాపులవస్తె గల్బా లేకుండ
తిరిగి పురుష్కేక పంపించినా బేటికిరమ్మండి
ఈవిధంబుగా పలికినాడుగా పాచ్చాపుదొరలు
తెల్వేలు అండి బూంచుగారినా బేటికవచ్చాను
సలాంసేసు సలాంసేసు బూంచుదొరగారు
తూర్పుదేశం పోదామండి బూంచిదొరగారు
ఈవిధంబుగా పలికినాడయ్య దుబాసలక్షుమయ్య
కట్టించిరి ఉరాలాడె గాడిబండ్లమీద
ఎత్తించి ఉరాలాడె ఎడ్లలమీదాను
తన్నుగొలిచె రాణువలంతా ప్రయాణమైనాది
దండుకు మనసు బదాయిగా హైదరుజంగోజ
హైదరుజంగు ప్రయాణమాయె అఘుడేయలోన

మందుగుండు సామానులతోటి ప్రయాణమైనారూ
గోల్కొండ లేచిన మజిలి యెక్కడదిగుతారూ
అనేకపల్లె మజిలి లేచే బూచిదొరగారు
అనేకపల్లెలో లేచినమజిలి యెక్కడ దిగుతారు
అనేకపల్లెలో లేచిన మజిలి రేఖలవలసలో
రేఖలవలస లేచినమజిలి సోడారములోను
సోడారములో లేచినమజిలి ఎక్కడదిగుతారూ
సోడాగారములో లేచినమజిల పిఠాపురములోను
పిఠాపురములో లేచిన ఎక్కడదిగుతారూ
పిఠాపురములో లేచినమజిలి పెద్దపురములోను
పెద్దాపురములో లేచినమజిలి రావులచెరువు లేమి
రావులచెరువు లేచినమజిలి నల్లచెరువుకాడా
డేరాలోపల కొలువైనాడు ప్రాంచిదొరగారూ
దుభాసివారి లక్ష్మయ్యనే బేటికిపిలిపించి
పరాకులేక వినండిమీరు దుభాసి లక్ష్మయ్య
విజయనగరము నేలేవాడు విజయరామరాజు
రాజుగారిపేరిట వక్కకాగితం పంపండి
ఇన్నిమాటలే పలికినాడుగా ప్రాంచిదొరగారూ
కాకితం కలంపుల్లగ చేతబట్టినాడు
పరాకులేక వినండిమీరు విజయరామరాజు
పుదుచ్చేరి యేలేటివాడు ప్రాంచిదొరగారూ,
ఇరువదినాలుగువేల దళముతో ప్రాంచివచ్చినాడు
తూర్పుదేశంచూచి వాడు ప్రాంచిపోతాడు
మీరు ఎదురుసేవకే రావలెనయ్యా విజయరామరాజు
ఇన్నిమాటలే వ్రాసినాడుగ జాబులోగాను
జాబువ్రాసి హర్కారులు చేతికిచ్చినాడు
విజయనగరమే పంపినాడు జాబురుగనుకాను
తిరిగి కాగితంబులే కలంపుల్ల చేతబట్టినాడు
బొబ్బిలియేలే రంగయ్యారు జాబులువ్రాస్తాడు

పరాకు లేక వినండిమీరు రంగయ్యదొరగారూ
పుడుచ్చేరి కాపురస్థుడు ప్రాంచిదొరగారూ
తూర్పు దేశం చూడను రాజా వస్తువున్నాడు
ఎదురుబేటికి రావలెనయ్యా రంగయ్యదొరగారూ
ఇన్ని వైనములు వ్రాసినాడుగ జాబుకులోగాను
హర్కారుల చేతికిచ్చిదా జాబునంపినాడు
బొబ్బిలిగోటకు పంపినాడుగ జాబుకమ్మలేమి
బొబ్బిలివారి దేవిడికాడా పారాలున్నాది
రాకాడికి డాకలైరి హర్కారులేమి
ఎవ్వరితాలూకన్నారండి పారాచౌకీలు
దుబాసివారి లక్ష్మయ్యానే తాకీ పంపాడు
పాఛావుల దివానగిరి దుబాసి లక్ష్మయ్య
జాబు కమ్మలు వ్రాసిపంపెను దుబాసిలక్ష్మయ్యా
ఈవిధంబున పల్కినారుగా హర్కారులేమి
అక్కు డేమని పలికినారు హర్కారులేమి
రంగరాయుడు బేటికిపోయి వగదీ తెస్తాము
అంతవరకు నిదానించుము హర్కారులేమి
ఆడనుండి వచ్చినాడుగ పారాచౌకీలు
రంగారాయుడు బేటికివచ్చి దండం బెడతారూ
పాచ్ఛావుల దివానగిరియంట దుబాసిలక్ష్మయ్యా
జాబుకమ్మ లంపించినాడుగ దుబాసిలక్ష్మయ్య
దేవిడికాడ వున్నాడండీ హర్కారులేమి
రమ్మంటార పొమ్మంటార రంగయ్యదొరగారూ
రమ్మనిచాల సెలవిచ్చెను రంగయ్యదొరగారూ
అటకాయింపు లేకుండనే రమ్మనిచెప్పెను
శల్వాలు అందివచ్చినారుగ పారాచౌకీలు
ఆడనుంచి వచ్చినారుగ హర్కారులేమి
రంగారాయుడి కొల్వుకురాజా కదలివచ్చినారూ
కొలువునవుంచి రాజులుగనుక దండంపెట్టిరి

లకోటాలు మరిచించినాడుగ జాబుచదివినాడు
పంక్తిపంక్తి పారజూచెను రంగయ్యదొరగారు
జాబులోనవర్తమానము కన్నులజూచెను
తిరుగుజాబులైన వ్రాయులేదు రంగయ్యదొరగారు
వారికథలు ఆలాగున్నది బొబ్బిలిలోగాను
అక్కడి విజయనగరమే వ్రాసినజాబు దారికిచేరింది
జాబులోని వర్తమానము కన్నులజూచెను
చూచి అనగ నల్లగుండు టాయిగ పగిలెను
హర్కారులపంపినాడుర విజయరామురాజు
వెనుకాముందు తోచలేదుగ రాజుగారికేమి
ఆలోచన చేసినాడు విజయరామురాజు
రెండుదినములు ఆలోచించెను విజయరామరాజు
బొబ్బిలిమీదుగ మనమువచ్చెను రాజుగారికేమి
వెంగళరాయుడి పేరిట జాబులువ్రాస్తాడు
చిన్నమాట చిత్తగింపుము వెంగళరాయుడా
మామీద కటాక్షముంచుము వెంగళరాయుడా
మాకుమీరు యెన్నిపగలున్నన్ను వెంగళరాయుండు
పరాసువారికి మమ్ము అయిన పట్టియివ్వరాదు
ఇపుడు పుదుచ్చేరి నుండేవాడు వ్రాంచీలచూచి
ముందుగుండు సామానులతోటి వ్రాంచివచ్చినాడు
యెదురుసేవకు రమ్మని వానికి వ్రాసినాడు
వాడియొక్క భాషాయంత్రము మాకు తెలియదు
మనవారికి భాషాయంత్రము వారికి తెలియదు
వాడు కల్లును గంజాయి తాగిదా కైపునవుంటాడు
దేహం తెలియక వుంటారండి వ్రాంసీల చూచి
మీరు మేము షామీలైతే వెంగళరాయుడు
మనము యెదురుబేటికి పోదామండి వెంగళరాయుండు
మీరు మేము వకటిగపోతె వెంగళరాయుండ
అక్కడ కానిపోని మాటలవచ్చి కలహంవస్తే

పుదుచ్చేరికి తరుమకొట్టుతాము భూంచిని గనుకాన
తిరుగుజాబు వ్రాయవలెనుగ వెంగళరాయుడు
మావిూద కటాక్షముంచుము వెంగళరాయుడు
వెనుకటి పగలు తలచవద్దు వెంగళరాయుడు
యిన్నివైనములు పలికినాడు జాబువ్రాసినాడు
జాబువ్రాసిన లకోటాలు చేకపంపాడు
జాబులు యిచ్చె బేగిరావుల చేతికిచ్చినారూ
బొబ్బిలికైన పంపినాడుగ విజయరామరాజు
బొబ్బిలివారి దేవిడీకాడ పారాలున్నారు
ఎవ్వరితాలూకా యున్నారోయి పారాచౌకీలు
రాజుగారి తాలూకంటూ వారు చెప్పినారూ
రాజుగారి పావిూకైతే యెందుకు వస్తిరి
రాజుగారిపేరిట జాబులు మేము తెచ్చినాము
వెంగళరాయుడు బేటికిపోయె వరదీ తెస్తాము
గడియసేపు నిదానించుమీ హర్కారులేమి
వెంగళరాయుడి బేటికివచ్చి పారావాండ్లయితే
రాజుగారిపేరిట జాబులు మీకు తెచ్చినాము
రమ్మంటారా పొమ్మంటారా మహాప్రభో నేడు
అటకాయింపు లేకుండనే రమ్మని పలికెను
ఆడనుంచి వచ్చినారు పారాచౌకీలు
పారావాండ్లు బాటనిచ్చిరి హర్కారులకు
వెంగళరాయుడు బేటికివచ్చి జాబులు యిచ్చిరి
దండం దండం దండం నీకు మహాప్రభో నేడు
లకోటాలు చించినాడు జాబు చదివినాడు
జాబులోనే వర్తమానము కన్నుల చూచెను
పుదుచ్చేరి యేలేటివాడు ప్రాంశీల బూచి
రాజమహేంద్రము జిల్లాలోనే డేరావేసినాడు
కీకరభాకర భాషాయంత్రము ప్రాంచివారిది
కల్లును గంజాయిత్రాగి కైపున వుంటాడు

వాళ్ళు తెలియక వుంటారండీ ప్రాంచిదండులు
వారివక్క భాషాయంత్రము మనకు తెలియదు
మనవక్క భాషాయంత్రము వారికి తెలియదు
కానిపోనిమాటలవల్ల కలహం వస్తేను
పుదుచ్చేరికి తరుమగొట్టుతాము ప్రాంచినిగనుకాను
ఇన్ని వైనములు వ్రాసివున్నది జాబుకులోగాను
ఆమాటలకేమన్నాడు వెంగళరాయుడు
కలకలకలకలకలనవ్వి వెంగళరాయుడు
రాజుగారి పౌరుషము యింతేనన్నాడు
తానుబిలచితె తానుపోవలె బూచీబేటికి
మమ్మపిలచితె మేముపోవలె బూచిబేటికి
తాడుకొప్పుపెట్టుకోని కోకకట్టుకొని కోటలోవున్నాడా
మూతిమీసంలేక యున్నాడ కోటకులోగాను
యెక్కడలేనికోపమువచ్చె వెంగళరాయుడికి
చదువుకున్న జాబులక్కడ చించివేసినాడు
చించివేసిన జాబులక్కడ తగలబెట్టినాడు
జాబులు తెచ్చిన హర్కారుల చెంపలుకొట్టించి
మెడలుపట్టి నెట్టించినాడురా వెంగళరాయుడు
ఘోడుఘోడున దుఃఖపోయిరి హర్కారులేమి
అక్కడనుంచి వచ్చినారుగ హర్కారులేమి
విజయనగరము వచ్చినారుగ హర్కారులేము
ఘోడుఘోడున దుఃఖపోయిరి హర్కారులేమి
వెంగళరాయుడీ బేటికిచాలా మేమపోతిమి
మీరువ్రాసినజాబు కమ్మలెవారి కొలువునవుంచితిమి
మీరువ్రాసిన జాబుగనుక చూరుచదివినారు
చదువుకొన్నవో జాబులక్క డ చించివేసినారు
చించివేసిన జాబులక్కడ తగులబెట్టినారు
మమ్మును పెళ్ళుపెళ్ళున చంపలుకొట్టించి వెంగళరాయుడు
శానాశానామాటలు మిమ్మ పోనాడినాడు

ఇన్ని మాటలు పలికినారుగా హర్కారులేమి
యెక్కడలేని కోపమువచ్చె రాజుగారికేమి
కుడిమీసమే దువ్వినాడుగ గుడ్లుయెర్ర జేసి
ఇంతకాడికి వచ్చినాడా వెంగళరాయుడా
వక్కగళితాతో లేపిస్తానుచూడు బొబ్బిలికోటాలూ
స్త్రీల చెరపట్టిస్తాను కోటకులోగానూ
రాజస్త్రీల ప్రాంచికూడు తినిపించకపోను
పొట్టక్రొవ్వు పట్టివున్నాడండి వెంగళరాయూడూ
ఇన్ని వైనములు పలికినాడు విజయురామరాజూ
తన్నుకొలిచే రాణువలంతా జాబులువ్రాసేనూ
తన లక్షాతొంబయివేలదండుకు జాబులువ్రాసేనూ
ఆలోచన చేసినాడుగా విజయరామరాజు
వెంబడి బంగారంరాజా తెప్పించినాడు
బూచిగారికి వుల్బాయులె చేయిస్తున్నాడు
బంగారపు పచ్చలటోపీ చేయించినాడు
,, పచ్చలకుల్టీ తయారుచేయించి
,, తట్టనుగనుక తయారుచేయించి
,, కోడిగుడ్లను తయారుచేయించి
,, నిమ్మపండ్లుగ తయారుచేయించి
,, అరటిపండ్లుగా తయారుచేయించి
,, కోడిపుంజుల తయారుచేయించి
,, మామిడిపండ్లుగ తయారుచేయించి
,, జాము పండ్లుగ తయారుచేయించి
,, బంగారుతీనిపీటలుగ చేయించినాడు
వెండితట్ట వకటిగనుక చేయించినాడూ
తట్టలోపల పండ్లుఫలాదులు తానువుంచినాడు
వుల్బాయలు అనిన యెత్తుకొనిగ వస్తువున్నాడు
లక్షాతొంబయివేల దళముగ కదలివచ్చినాది
లక్షాతొంబై వేల దళముగ కన్నులజూచేను

యేనుగుమీద యంబారైనా కట్టించినారూ
అంబారిమీద ముత్యాల పందిరి వేయించినాడు
అంబారిలోనే కొలువైనాడు విజయరామరాజు
యేనుగమీద రణభేరిగ యెత్తించినాడు
గుఱ్ఱంమీద ఢంకాకుండలు యెత్తించినాడు
వొంటెలమీద నగరాకుండ యెత్తించినాడు
రాజు లక్షాతొంబై వేల దళములతో బయలుదేరినాడు
ప్రాంచివారి డేరాలకు వస్తుయున్నాడు
రంగరంగ వైభవముతోనే వస్తుయున్నాడు
రణమో రణమోయంటు రణభేరి పలికింది
ఢాంఢాంయన ఢాంఢాంయన ఢంకాపలికింది
చారుమేళమే భరితుమేళమే కూచీలైనాదీ
ఈవిధంబున డేరాలకు వస్తుయున్నాడు
రాజువచ్చే వురవడి ప్రాంచి చూచినాడు
టోపీతీసి చేతపట్టుకొని ప్రాంచిదొరగారూ
వంగి సూడు కూర్నిసులుచేసే ప్రాంచిదొరగారూ
యెదురుసేవకే యేడు యడుగులే ముందు నడచినాడూ
అంబారి తగ్గినాడుగా విజయరామరాజూ
రాజుగారు ప్రాంచిగారు సంతోషపడినారూ
చెయ్యిచెయ్యి పట్టుకొని డేరాకు వస్తారూ
ప్రాంచివారికి రాజుగారికి కౌగిలింపులాయె
అప్పుడు ప్రాంచివారికి పచ్చలకుర్చీ వేయించినాడు
కుర్చీమీదనే కొలువైనాడు ప్రాంచిదొరగారూ
ప్రాంచివారికి యెదురుగానే కుర్చీవేయించి
దెచ్చినవొక్క వుల్బాయలే కొలువున వుంచి
సన్నబియ్యమే చాయపప్పుగా కొలువున యుంచెనూ
వేటపోతులె కోళ్ళకావిళ్ళె కొలువున యుంచెనూ
భూతుపిల్ల బుక్కాయిప్పెట్టె బూసికిమేపూను
బంగారంపు కోడిపుంజుల కొలువున యుంచేనూ

రాజుమాటలె విన్నారండీ ప్రాశీల బూచి
పలుకలేక మాటలాడగలేక ప్రాశీదొరగారూ
బూచిగారివో మొగము చూచెర విజయరామరాజూ
రెండువేల వరహాలైన సదరు తోసినాడూ
వరహాలైన కన్నులు చూచే ప్రాశీదొరగారూ
బొబ్బిలికోట పర్మానాలు వ్రాసియిచ్చేనూ
ఆడనుండి రాణువలంతా బయలుదేరినాది
రాజుగారు బూచీగారుగ సామీలైనారూ
అప్పుడేమని పలికినారురా విజయరామరాజూ
తన్నుగొలిచే రాణువలంతా తాను పిలిచినాడూ
తసలక్షాతొంబై వేల దళముతో బూచీవచ్చేనూ
ఇరువై నాలుగువేల దళముతో బూచివచ్చేనూ
బూచి యిరువై నాలుగువేల దళములతో ప్రయాణమైనాడూ
తనముంది మార్బలమును వెంటతీసుకోని
బూచిగారు రాజుగారు బొబ్బిలికొస్తారూ
అప్పుడు కిటకిటమంటా దండేవస్తాది
ఈవిధంబున వస్తున్నారు బొబ్బిలికోటలాకూ
వారికథలు అలాగున్నది ఆవికే పల్లెలోనూ
బొబ్బిలియేలే రంగయ్య యేలాగున్నాడు
జాబువచ్చిన మొదలుకొనిగ రంగయ్యదొరగారూ
రాజుగారిని నమ్మలేకనే రంగయ్య దొరగారు
వకట్టినాటి సముయమందున రంగయ్య దొరగారు
నిండుకొలువైనాడు ప్రభువు రంగారావూ
తన్నుకొల్చే రాణువలంతా కొలువున యున్నారు
తాండ్రవారి పాపారాయుడు కొలువు లేదండీ
అప్పుడేమని పలికినాడుగ ప్రభువు రంగారావూ
ఇద్దరివక్కట్టు హర్కారులను కొలువుకు పిలిపించి
తాండ్రపాపారాయుడు కొలువుకు రాలేదూ
తాండ్రవారి పాపారాయుని కొలువుకు పిలవండీ

ఈవిధంబున పలికినాడుగ ప్రభువు రంగరావూ
పరుగుపరుగున వచ్చినారుగ హర్కారులేమీ
పాపారాయుడు బేటికివచ్చి దండంబెట్టిరి
పరాకులేక వినండిమీరు పాపారాయుండూ
మీబావగారు రంగయ్యా పిలువమన్నారు
ఈవిధంబున పలికినారుగ హర్కారులేమీ
చదురుదిగ్గున లేచినాడయ్యా పాపారాయుండూ
కూర్మికుచ్చుల పల్లకిలోను కొలువుతీరినాడు
పన్నెండుమంది గాలుబోయులు పాలకిబట్టిరి
నిండుకొలువుకే వచ్చినాడుగా పాపారాయుండూ
రంగారాయుడి బేటికివచ్చి పాలకీ తగ్గేను
పాలకితగ్గి కొలువుకువచ్చే పాపారాయుండూ
వందనమయ్యా వందనమయ్యా మహాప్రభో నేడు
నన్నుపిలచిన కారణమేమి తెలియాచెప్పండి
ఈవిధంబున పలికినాడుగ పాపారాయుండు
పరాకులేక వినండీ మీరు పాపారాయుడా
పుదుచ్చేరి కాపురస్తుడు ప్రాంచిదొరగారు
తూర్పుదేశం చూడనురాజా వస్తువున్నాడు
రాజారంపై బాటలోకి రాణాపొన్నండి
మిమ్ముగొలిచే రాణువలంతా వెంటపిలుచుకొని
సలహా సమ్మతి మాటలమీద వెనక్కు బంపండి
కానిపోని మాటలమీద కలహామువస్తేను
నల్లయేటిలో సాల్సులైనా గోరిపెట్టండి
త్వరగా రాజారంపు కోటలోనికి రాణాపొన్నండి
ఈవిధంబున పలికినాడు రంగయ్యా దొరగారు
ఆడనుంచి బయలుదేరెను పాపారాయుడు
తన్నుగొలిచే రాణువలంత వెంట తీసుకొని
రాజారంపై బాటలోకి పోతువున్నాడు
పాపయ్యాకే శల్వాలు యిచ్చే ప్రభువు రంగారావు

పన్నెండుమంది తెలగలానే తాను బిలచినాడు
పన్నెండుమంది తెల్గాలయిన కొలువుకువచ్చిరి
మమ్ము పిలిచిన కారణమేమి రంగయ్యదొరగారూ
పుకాచ్చేరి కాపురస్తుడు ప్రాంశీలబూచి
తూర్పుదేశంచూడను రాజావస్తువున్నాడు
ఈవిధంబున పలికాడు రంగయ్యదొరగారు
మంచిది మరిబాగన్నరోయి తెల్గాలైతేను
వారివారి ఆయుధములుగా జేతబట్టిరి
బంటుకు పన్నెండు ఆయుధాలతో ప్రయాణమైయ్యారు
వీరమట్టుకు వచ్చినారుగ తెల్గాలైతేను
రాజారంపుచేరినాడుగ పాపారాయుడు
రాజారములో రాయిగాను తాణావున్నాడు
తన్ను గొలిచే రాణువలంత వెంటతీసుకొని
రాజారంపై బాటలోగా తాణావున్నాడు
వీరికథలు యీలాగునవున్న బొబ్బిలిమీదను
ఆడ రాజమహేంద్రము జిల్లాలనుండి రాజుగారుతాను
ప్రయాణమై వస్తువున్నారు బొబ్బిలికోటకు
రాజుగారు బూచిగారు పాయ్యాలైనారు
రాజమహేంద్రము లేచినమజిలి యెక్కడదిగుతారు
నల్లకొండలో మజిలిచేరి ప్రాంచిదొరగారు
నల్లకొండలో మజిలి పెద్దాపురములోను
పెద్దాపురములో లేచినమజిలి యెక్కడదిగుతారు
పెద్దాపురములో లేచినమజిలి పిఠాపురములోను
పిఠాపురములో లేచినమజిలి యెక్కడదిగుతారు
పిఠాపురములో లేచినమజిలి సామర్లకోటలోను
సామర్లకోటలో లేచినమజిలి మన్నెంమీదను
మన్నెంమీద దిగుమతులాయె ప్రాంచిదొరగారూ
మన్నెంమీద డేరాలైనా ...యించినారు
నిండుకొలువు కొలువైనాడు ప్రాంచీదొరగారూ

అప్పుడెట్లా వున్నాడయ్యా విజయరామరాజు
బూచిగారి బేటికిరాజా వస్తువున్నాడు
ఫ్రాంచివారి బేటికివచ్చే సలాంచేసేను
అప్పుడేమని పలుకుతాడురా విజయరామరాజు
పరాకులేక వినండిమీరు ఫ్రా చీవారగారు
మన్నెంమీదపోతే బొబ్బిలి మూడామడవుంది
మన్నెంతిరిగిపోతే బొబ్బిలి ఆరామడవుంది
అట్లాపోదామా యిట్లాపోదామా ఫ్రాంచిదొరగారు
పరాకులేక వినండిమీరు విజయరామరాజు
మన్నెం తిరిగిపోదామండి విజయరామరాజు
యీవిధంబున పలికినాడు ఫ్రెంచిదొరగారు
అప్పుడేమని పలికినాడు ఫ్రెంచిదొరగారు
మన్నెంతిరిగి పోగూడదు ఫ్రెంచిదొరగారు
తాండ్రవారి పాపారాయుడు టాణావున్నాడు
రాజారంపై బాటలో టాణావున్నాడు
రాజానిలువనివ్వడు పాపారాయుడు
నల్లయేరు దాటనివ్వడు పాపారాయుడు
అడవిబాటగ పోతామండీ ఫ్రాంచిదొరగారు
ఈవిధంబున పలికినారు విజయరామరాజు
అయితే మంచిది మరిబాగన్నాడు ఫ్రాంశీలబూచి
అప్పుడెట్లా వున్నాడయ్యా విజయరామరాజు
తన్నుకొలిచే రాణువలంతా తానుబిలచినాడు
అన్నలార తమ్ములార మాయన్నలార
దండుకుమన సుబేదారుగ జగన్నాధరాజు
కాకర్లపూడి జగన్నాధరాజును కొలువుకు పిలువండి
నిందుకొలువుకై పిలువమన్నారు హర్కారులేమి
మంచిది మరిభాగన్నారు హర్కారులపుడుదా
వందనమయ్యా వందనమయ్యా జగన్నాధరావు
రాజుగారు బిల్వమన్నారు జగన్నాధరావు

ఇన్ని మాటలు విన్నాడయ్యా జగన్నాధరావు
తన్ను గొలిచే రాణువలంతయు వెంటతీసుకొని
రాజుగారి కొలువుకువచ్చె జగన్నాధరావు
నన్ను బిలచిన కార్యమేమి యెరుగబల్కుము
కొందరైనా హర్కారులను వెంటతీసుకొని
అడవిబాట గొట్టించుము జగన్నాధరావు
మన్నెంమీదికి అడవిబాటలు గొట్టించుమయ్యా
మంచిదన్నాడు బాగుయున్నాడు జగన్నాధరావు
మూడువేల రాణువులను వెంటతీసుకొని
ముందుగాదానుదా మన్నెంమీదికి బాటలుత్రవ్వెను
చెట్టుపుట్టలు గొట్టెనయ్యా రాయిగ యిపుడుదా
గొప్పగొప్ప వృక్షములంతయు గొట్టిత్రోచెనయ్యా
నూలుబట్టిదా బాటలుయపుడు యేర్పరచినారూ
రాజువీధిగా గొట్టుతారయ్యా జగన్నాధరావు
యీరీతిగా బాటలుయీపుడు యేర్పరచినాడు
అపుడేలాగున్నాడయ్యా విజయరామరాజు
కట్టివేసెను డేరాలపుడు గాడిబండ్లమీద
యెత్తించెను డేరాలపుడు యెద్దుబండ్లమీద
ఫిరంగిగుండు యెత్తించినారయ్యా అపుడైతేను
రామూరి పొగబాణము బండ్లమీద వేసిరి
మున్నారు జీనిగుఱ్ఱములు ముందుగ నడిచెనూ
ఆవెంబడి కదలెనయ్యా యేనుగులబారూ
ఆవెంబడి వస్తువున్నాడు లాల్ఖానుడైన
ఆవెంబడి వస్తువున్నాడు హైదరుజంగోజీ
ఆవెంబడి వస్తున్నది గుఱ్ఱాలగుంపైతే
ఆవెంబడి వస్తున్నది ప్రాంచిదండపుడు
ఆవెంబడి వస్తున్నాడు దంబాసిలక్షూన్నడు
ఆవెంబడి వస్తున్నారు రాజుల దండైతే
మన్నెంవిడిచి నడిచినారు రాణువలంతానూ

అర్ధరాత్రి డీకొన్నారు వీర్లతట్టూకు
వీర్లతట్టులో పన్నెండుమంది తెల్గాబిడ్డాలూ
మరచి నిద్రబోతున్నారు తెల్గాబిడ్డలూ
గుర్రపుసందడి విన్నరయ్యా తెల్గాంబిడ్డాలూ
పడకయందె దట్టిగట్టిరి తెల్గాబిడ్డలూ
యీటికత్తులు చేతబట్టిరి తెల్గాబిడ్డలూ
చెట్టుయెక్కి రాజూ చూచినారయ్యా తెల్గాబిడ్డాలూ
దొంగగుర్రములు వచ్చియపుడు తెట్టుకమ్మినాదీ
అన్నలార తమ్ములార మాయన్నలార వినుడూ
రంగయ్యతో చెప్పను ఆలస్యమాతుందీ
రామరామ యని అనంతకాలము రాజ్యమేల లేమూ
జగముపుండు కాలమువరకును మనము వుండబోతామా
శ్రీరాములు యేలినట్టుగ రాజ్యమేల లేమూ
యెన్నిదినములు బ్రతికినగాని చావే గలుగూను
యిచ్చట చచ్చినవారికి యిపుడు వీరస్వర్గమూ
ధైర్యము చేసుకొని తెట్టును దూకిరి
కలిచికలిచి తీసినారయ్యా కవాతుగుర్రమూ
వెనుకచిక్కి వస్తున్నారు ప్రాంశీలందూ
యచ్చటనుండు రాణువమీద కలపటమైనారూ
నరికితోచినారయ్యా యేనుగ గుంపుదా
మాష్టికుల గొట్టికోసిరి ముందుగ యపుడూదా
కండలు పేగులు బైటికవచి భూమినపడ్డారూ
యక్కడయుండు పారాలన్ని వెనుకవెళ్ళినాది
తెట్టులో దూకినాయిగ తెల [illegible] లైతేను
గడియసేపు నిదానించిరి తెల్గాలైతేను
వెనుకపోయిన దండుయపుడు ముందుకునడిచిందీ
మున్నూట కవాతుగుర్రము ముందుగ నడిచిందీ
తెట్లకాడికి పోకొన్నది తురుపు గుర్రాలామూ
గుర్రపుచప్పుడు విన్నారయ్యా తెల్గాబిడ్డలు

పన్నెండుమంది తెల్గాబిడ్డలు తాయిగవచ్చిరీ
వొకరి యెచ్చిరించినా తెలగాబిడ్డలు
మించివచ్చిన కార్యమపుడు విడువకూడదన్న
చచ్చిన బ్రతికిన పేరుంటాది వీర్ల తెట్టులోను
వెనుకముందు జూడవద్దు దండుకులోగానూ
దండులోగా దూకినారు తెలగాబిడ్డలూ
గుద్దిగుద్ది చ పినారయ్యా గుఱ్ఱాలగుంపూను
చేతిలోను నలిపినారయ్యా గుఱ్ఱాలగుంపూను
మెడనుబట్టి వీపుమీద బాకుతో పొడిచిరీ
తెల్లకింద నే జేరనివ్వక తరుముతువున్నారూ
అప్పుడెట్లా వున్నాడయ్యా హైదరుజంగోజి
వీరల తెట్లయుద్ధము యపుడు కన్నులజూచేను
గుండెలుయపుడు గుద్దుకొన్నాను హైదరుజంగోజీ
ప్రాంచివారి బేటికివచ్చె హైదరుజంగోజి
వీర్ల తెట్టు యుద్ధమిపుడు జరుగుతుయున్నాది
పన్నెండుమంది తెల్గాబిడ్డలు తాయిగవుండారూ
యికయేమున్నది యికయేమున్నది ప్రాంచీదొరగారూ
యనేకదండు హతమైపోయెను ప్రాంచీదొరగారు
గెట్టివారట గెట్టివారట తెలగాబిడ్డలూ
జెయించజాలము జెయించజాలము వీర్ల తెట్లలోను
మూడుపుట్ల నల్లమందుకే శెల్వాలుయివ్వండి
సద్దుచప్పటిలేకుండా తెట్లముంచుదాము
రాత్రిపూటనే చేరుతాము బొబ్బిలికైతేను
యీలాగు యడుగసాగెను హైదరుజంగోజి
మూడుపుట్ల నల్లమందుకే సెలవుయిచ్చేను
పల్లముతోడి వూడిపించెను హైదరుజంగోజి
నాలుగుప్రక్కల వత్తులబ్రాళ్ళు [illegible]ంపుగ బెట్టిరి
వత్తులుబెట్టే జాతులవారు వెంబడియున్నారూ
మున్నూరు కనాతుగుఱ్ఱము ముందుగ నడిచేనూ

గుబ్బుమని దూకినారు తెలగాబిడ్డలూ
నాలుగుప్రక్కల ద్రిప్పినారుగ కవాతుగుఱ్ఱమూ
తెలియక వచ్చినల్లమందున గొబ్బునపడ్డారూ
నాలుగుప్రక్కల మందుత్రాళ్ళు అంటించినారూ
ధగ్గుధగ్గున రగిలినాదయ్యా ధూళికిపోగాను
మలమలయని మాడినారయ్యా తెల్గాబిడ్డలూ
నల్లమందుకే ధూళియైనారు తెలగాబిడ్డలూ
రాత్రివేళ యొకవేళలో తెల్లనమించిరి
రాత్రివేళ యొకప్పుడే బొబ్బిలికమ్మరి
శక్తిబాణము మెత్తివిడిచెను జాబిరెల్లికాదూ
పాయక రాముని పేటలోపల శరాళ్ళడేరాలు
అడవిబాటలో దిగినాడయ్యా హానావెళ్ళినాడా
మల్లమ్మదవి చెరువుమీద మందులుపెట్టుతాడా
వెంగళరాయుడు వనమునందు యోసగుల గుంపుదా
రచ్చాబండా రేపులకాడ లాలుఖానుడైన
మంచినీళ్ళబావులకాడ డుబాసలతోనుమయ్యా
పాతబొబ్బిలి పాటిమీదన ప్రాంచిదిగెను
కొల్లపల్లి కోనేటిలో రాజుడేరాదా
వచ్చేలసరు రు వస్తువున్నది రాణువలంతాను
ఈరీతిగా దిగినారయ్యా రాణువలంతాను
యెటుప్రక్కజూచినా డేరాలుండేనూ
నువ్వులుచల్లిన రాలదయ్యా దండుకులోగాను
యీరీతిగా నున్నాడయ్యా కోటకులోగాను
అన్నిదళములు వచ్చియప్పుడు బొబ్బిలికిమ్మిందీ
యెండతగలక యెత్తినారయ్యా యెర్రాడేరాలు
మంచుతగలక యెత్తినారయ్యా మైనపుడేరాలు
డేరాలోపల కొలువైయున్నారు ప్రాంచిదొరగారు
అప్పుడెట్లా వున్నాడయ్యా ప్రాంచిదొరగారు
ప్రాంచివారి దండుకోడిదా యెత్తించినారూ

రాజుగారి తెల్లజండా యెత్తించినారూ
రాజుగారు డేరాలోపల కొలువైయున్నారు
నిమిషంబుదా ఆలోచించెను విజయరామరాజు
ప్రాంచివారి డేరాకుదా అప్పుడువచ్చెను
అప్పుడేమని చెప్పినాడయ్యా విజయరామరాజు
చిన్నపలుకులు చిత్తగించుము ప్రాంచిదొరగారు
కోటకమ్మిన సంగతియపుడు రంగయ్యకైతేను
బొబ్బిలికోట రంగయ్యకు యెరుకచేస్తామయ్యా
యీరీతిగా చెప్పినాడయ్యా విజయరామరాజు
ఈలాగు చేయమనెను ప్రాంచిదొరగారూ
పెద్దలనాటి నగారబల్ల చేతబట్టినాడూ
డాండాండాండాం మని ఢంకాపలికేను
రణమురణము రణమాటా నగారిపలికింది
ప్రాంచివారి లుంజాయిపాటలు పాడింది
అప్పుడెట్లా వున్నారయ్యా బొబ్బిలిదొరలూదా
చంద్రశాల మండపమున రంగయ్యదొరగారు
పగడశాలలు ఆడినవెనుక సాముకుపోతాము
సాముకుబోవు సమయమందు శబ్దమువిన్నాడు
తిమ్మనాడియొక్క చంద్రశాలకే తానువచ్చినాడూ
తట్టితట్టి లేపినాడయ్యా వెంగళరాయుణ్ణి
కలవరపడి లేచినాడయ్యా వెంగళరాయుండు
వందనమయ్యా రంగయ్యదొరగారూ
యెన్నడురానివారు యిప్పుడు యేలవస్తిరీ
వేళకానివేళయందు కోటకువస్తిరీ
యేమిఅపాయం జెందెనయ్యా వీరబొబ్బిలీకి
మీరువచ్చినకార్యమేమి తెలియజెప్పుమయ్యా
ఈరీతిగా పలికినాడు వెంగళరాయుండు
అప్పుడు రంగయ్య యేమంటారు వెంగళరాయునితో
యేమిజెప్పుదు యేమిజెప్పుదు వెంగళరాయుడా

సాయంత్రంవేళ కోటక్రింద సవారిపోతిని
సద్దుచప్పడి లేదయ్యా కోటలక్రిందాను
చంద్రసాల మంటపములో వెంగళరాయూడా
పగడసాల అనినేను సాముకుబోతిని
అప్పుడు మనకోటలక్రింద నగారపలికిందీ
నగారశబ్దము యెక్కడిదయ్యా వెంగళరాయూడా
యిట్టిశబ్దము యెక్కడిదయ్యా వెంగళరాయూడా
పరాకుంచక వినుము యిప్పుడు అన్నయ్యాదొరగారు
ఈరీతిగా చెప్పినాడయ్యా రంగయ్యదొరగారు
రణభేరి శబ్దముగాదు రంగయ్యాదొరగారు
మల్లమ్మదేవి చెరువుక్రింద కాపులవారుదా
కంబులు విత్తులు చాలజల్లిరి అన్నయ్యాదొరగారు
చేనుకాడ పిల్లకాయలు తుడుములు కొట్టినారు
యీరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుండు
ఆమాటకు తాళజాలక రంగయ్యాదొరగారు
తుడుములుకాదు తుమ్ములుకాదు వెంగళరాయూడా
నగారశబ్దము వింటినయ్యా వెంగళరాయూడా
ఈరీతిగా చెప్పినాడు రంగయ్యాదొరగారు
పరాకుంచక వినుముయిప్పుడు వెంగళరాయూడా
తమ్ముడుమాటలు నమ్మలేకనే అన్నయ్యాదొరగారు
అనంతబురుజు యెక్కిజూతాము వెంగళరాయూడా
ఈరీతిగా చెప్పినారు రంగయ్యాదొరగారు
చెయ్యిచెయ్యిలో ముట్టడించి వస్తువున్నారు
అనంతబురుజు యెక్కిరప్పుడు అన్నతమ్ముల్లూ
జోడుకుర్చీయచ్చట యప్పుడు వేయించినారు
కుర్చీమీద కొలువుతీరిరి అన్నాతమ్ములు
తెల్లవారి వచ్చినదయ్యా బొబ్బిలిమీదాను
మల్లమ్మదేవి చెరువుప్రక్క కన్నులచూచేను
పరాకులేక వినుము యిప్పుడు అన్నయ్యాదొరగారు

పడమటిచేను ఆవులగుంపు పట్నంపోతాది
కట్టమీదనే మేతమేసి నిలిచియున్నాది
కోటలక్రింద రంతుయేమి వెంగళరాయుడా
వుత్తరాది గొఱ్ఱెలగుంపు పట్నంబోతాది
కోటచుట్టు మేతలుమేసి నిలిచియున్నాదీ
యీరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుండు
అట్టిమాటలకు యేమన్నాడు రంగయ్యాదొరగారు
పాతబొబ్బిలి పాటిమీదనే గుంపులు యేమయ్యా
చుట్టుప్రక్కలనుండెడి దున్నపోతులు పట్నంపోతుందీ
పాతబొబ్బిలి పాటిమీదనే కంచులు వున్నాది
కంచులువేసి పాటిమీదనే నిమ్మళించినాది
ఇందాక యికయేమిలేదు అన్నయ్యాదొరగారూ
తెల్లవారి ప్రొద్దుబుట్టెను బొబ్బిలిమీదాను
నాలుగుప్రక్కల పారాజూచెను రంగయ్యాదొరగారూ
ప్రాంచివారి తెల్లజండా కన్నుల జూచేను
యెటుప్రక్క జూచినగాని యేనుగ గుంపుదా
యెటుప్రక్క జూచిన గుఱ్ఱాలగుంపుదా
సందుబొందు జూచినగాని సానకత్తులూ
తత్తరించి నున్నాడయ్యా దండుకు యపుడుదా
యీరీతిగా నున్నాడయ్యా కోటలక్రిందాను
అప్పుడేమని చెప్పినాడయ్యా రంగయ్యా దొరగారూ
పరాకుంచక వినుము యిపుడు వెంగళరాయూడా
పోరులేని బొబ్బిలిమీద పోరుగలిగింది
పెద్దలనాటీ బొబ్బిలికిపుడు భోగము చెల్లింది
ఇక్కడయుండ దగదయ్యా బొబ్బిలికోటాలో
రాజుగారితో మనము జయించజాలమూ
నల్లమందు గుండుతోను ప్రాంచివచ్చినాదూ
నల్లమందుగుండుకుముందు కత్తియెత్తరాదూ
చేతియుద్ధము యెత్తినానూ

కోటలంతా కోరసింహము పాపారాయుడూ
రాజాయచ్చట వచ్చునని బాటకాంచియున్నాడూ
దొంగత్రోవల బాటలజూచి తానువచ్చినాడు
పాపారాయుడుయుంటే మనకు భయములేదయ్యా
తలుపు తెరచి జడసన్నట్లముగా బొబ్బిలికోటాకు
పాలుకోలు ముండ్యాలు మనము భాగుచేసుకోని
పాలకోలు ముండ్యాలమునము భాగుచేసుకుంటే
రాజస్త్రీలు పిలచుకొని వల్సలుబోతామూ
వెనుకవచ్చి చెంగలుకొట్టి బొబ్బిలితీతాము
యీరీతిగా చెప్పినాడయ్యా రంగయ్యదొరగారు
అన్నమాటలు విన్నాడయ్యా వెంగళరాయుండు
యెక్కడలేని కోపమువచ్చెను వెంగళరాయుడికి
మండివేసి కొలువుదీరెను వెంగళరాయుండు
హింసమాటలు పల్కవద్దు అన్నయ్యదొరగారు
భీతియిప్పుడు యుంచవద్దు అన్నయ్యదొరగారూ
రాజస్త్రీల తీసుకొని వల్సలు బోతేను
పడమటిసీమల మెలమా నవ్వరవింటేనూ
చుట్టుప్రక్కల రాజులువింటే హేళనము గాదయ్యా
మానముపోయినపిమ్మట యిట్టిప్రాణ మెందుకయ్యా
రామరామ యనంతకాలము రాజ్యమేలుతామా
జగము వుండు కాలమువరకు వుండడము లేదూ
యెన్నిదినములు బ్రతికినగాని చావు సిద్ధమానే
ఆపత్తియిన వచ్చినయపుడు అన్నయ్యదొరగారూ
ధైర్యమంతయు విడువరాదు అన్నయ్యదొరగారూ
పిరికిమాటలు బలుకవద్దు అన్నయ్యదొరగారూ
పరాకుంచక వినుము యిప్పుడు అన్నయ్యదొరగారు
చాలుచాలు నీమాటలు అన్నయ్యదొరగారూ
రెండుఘడియలు సెలవిచ్చిన తమాష చూడండి
పన్నెండేండ్లు సాముచేసితి సాధనగరిడీలు

సాముజేసిన రెట్టలకిపుడు బలమూ కలిగిందీ
లాయమునందుండు బారా తేజికి సవారి గలిగిందీ
తుక్కు బట్టిన పట్టాకత్తులు తుక్కులు వదిలిందీ
మొలనుయుండు పచ్చలబాకు బర్రున పెరికేనూ
ఉడాను వేసి భూమినదూకెను వెంగళరాయుండూ
తమ్మునిమొక్క కోపమును కన్నులచూచేను
కౌగలించి పట్టినాడయ్యా వెంగళరాయూడా
తామసించుము తామసించుము వెంగళరాయూడా
అవసరపడితె పనులుకావుర వెంగళరాయూడా
దామర్లవారి ధర్మారాయుని సంధికిపంపితే
రాయభారము తీర్చికొనిదా రాయుడువస్తాడు
రాయబారము కుదరకపోతే పిమ్మట చూతాము
ఈరీతిగా పలికినాడయ్యా రంగయ్యదొరగారూ
పరాకుంచక వినుము యిపుడు అన్నయ్యదొరగారూ
అచ్చటనుండి వస్తున్నారు అన్నతమ్ములూను
తన్నుగొల్చే రాజులంతా కొలువుకు వచ్చేను
బండిరి రామానాయుడు కొలువుకు వచ్చేను
ముత్యాలవారి పాపారాయుడు కొలువుకు వచ్చేను
పటాలవారి రామన్నయు కొలువుకు వచ్చేను
దామర్లవారి ధర్మారాయుడు కొలువుకు రాలేదు
పిలువుమయ్యా పిలువుమయ్యా ధర్మారాయున్ని
ఈలాగున చెప్పినాడయ్యా రంగయ్యదొరగారు
హర్కారులను పిలచినాడయ్యా రంగయ్య దొరగారు
ధర్మారాయుడు పేటకివచ్చి హర్కారులపుడు
వందనమయ్యా వందనమయ్యా ధర్మారాయుడా
బావగారు రంగయ్య నిన్ను పిలువమన్నారు
ఈరీతిగ చెప్పినాడయ్యా హర్కారు లపుడుండా
యెందుకునన్ను పిలువమన్నాడు బావగారిపుడుండా
అట్లుచెప్పుతు పలికేను ధర్మారాయుండు

బావగారి ముందుగవచ్చి వందన మొసగేను
యేలనన్ను పిలిచినారుగ బావగారి కిపుడుదా
అప్పుడేమని చెప్పినాడయ్యా రంగయ్యా దొరగారు
యేమనగా యేమనిజెప్పెదు ధర్మారాయుండా
రాజుగారికి మనకు నిండు పగలూ గలిగెను
తూర్పుదేశము చూడను యిపుడు పగలూ గలిగెను
తూర్పుదేశము చూడను యిపుడు ఫ్రాంచివచ్చినాడు
పుదుచ్చేరి యేలేటివాడు ఫ్రాంచి దొరగారు
ఇరువైనాలుగువేలి దండుతో ఫ్రాంచివచ్చేను
రాజుగారి ఫ్రాంచీదొర తాకీ పంపేను
యెదురుసేవకే రమ్మని తాకీపంపేను
తాకీదపుడు జూచుకొన్నడు విజయరామరాజూ
వెంగళరాయుడు పేరిట యిపుడు జాబులు వ్రాసేను
జాబును యపుడు చేతికిచ్చెను వెంగళరాయుడికీ
జాబులోని సంగతులన్ని కన్నుల జూచేను
చదివినట్టి జాబులను చింపివేసినాడు
చింపినట్టి జాబులను తగలపెట్టినాడు
జాబుదెచ్చిన హర్కారులను చెంపలు గొట్టినాడు
మెడనుబట్టి తోచెను వెంగళరాయుండు
ఘోడుఘోడున దుఃఖపడిరి హర్కారులపుడుదా
విజయనగరము చేరిరయ్యా హర్కారు లపుడుదా
ఈసంగతులు రాజుతో మనవి చేసినారు
రాజుగారికి కోపముజెందె యట్టివేళలోను
కోటమీదికి దండు తెచ్చెను విజయరామరాజూ
దేశము తెలియని ఫ్రాంచిగారు దేశముపై వచ్చిరి
నల్లగుండు మందుతోను ఫ్రాంచివచ్చినాడు
నల్లమందుతోను పోట్లాడుతారు ఫ్రాంచీదొరలూదా
రాజుమనము యెందుకైన పోరాడగలడు
నల్లమందు గుండుకు ముందు నిల్వలేమూ.

రాయభారము పోవలెనయ్యా ధర్మారాయుండు
ఆమాటకే కోపము జెందె ధర్మారాయుండు
వెంట్రుకలంత గదలించె రాయుడికైతేను
చాలుచాలు నిలువమయ్య రంగయ్యదొరగారు
పూసపాటి బేటికినన్ను పొమ్మంటారా
ప్రాణముతోను రాజు బేటికి నేనుబోనయ్యా
యుద్ధమునకు పొమ్మంటేను నేనుపోతాను
యింతపనిదా జేతును బావయ్యదొరగారు
యిట్టిమాటలు చెప్పినాడయ్య ధర్మారాయుండు
అట్టిమాటలకు యేమన్నాడు రంగయ్యదొరగారూ
పరాకుంచక వినుము యిపుడు ధర్మారాయుడు
రాజుగారిబేటికినీవు యిపుడే పోవద్దు
ప్రాంచివారి డేరావద్ద నీవె పోవయ్యా
రాయభారము చెప్పినీవు రాయిగరిక్కండీ
యిన్నిమాటలు చెప్పినాడయ్య రంగయ్యదొరగారు
అప్పుడేమని చెప్పినాడయ్య ధర్మారాయుండు
పరాకుంచక వినుము యిపుడు రంగయ్యదొరగారు
కీకరభాకర భాషాలైతే ప్రాంచీవారిదీ
కల్లుసారాయి త్రాగినారు కైపునపుంటారు
దూగిపడుతూ యుంటుండయ్య ప్రాంచిదొరగారు
సంధిమాటలు యేలాగునయ్య చెప్పవత్తునయ్యా
యీలాగున చెప్పినాడయ్య ధర్మారాయుండు
పరాకుంచక వినుము యిపుడు ధర్మారాయుండు
బందరులోని కాపురస్తుడు దుబాసిలక్ష్మయ్య
నాలుగుచదువులు చదివినాడయ్య దుబాసిలక్ష్మయ్య
లక్షుమయ్య డేరావద్దకు సంధికిపొమ్మండి
యింతపైకము అడిగినాడని వెనుకతియ్యవద్దు
యిచ్చుటవచ్చినందుకు లక్షలుయిస్తాము
మజిలీయొకటి లక్షపైకము మేమేయిస్తాము

మందు సెలవులు సిబ్బంది సెలవులు మేమేయిస్తాము
నలంబత్తాయి సారాయి శెలవులు యినాము యిస్తాము
అంబారిగట్టిగ యేనుగయినాము యిస్తాము
పొమ్మంటేను మండ్యాలభూమికి యిప్పుడె పోతాము
కార్యమందు వాచన లేదు బొబ్బిలివారికి
ఈతూరి మన్నించుమయ్యా బొబ్బిలివారిని
పసిబిడ్డలబాలింతలు కోటలోయున్నాము
ముసలి ముతకలతోను కోటలోయున్నాము
రాజుమాటలు వినేదిమీకు న్యాయముకాదయ్యా
రాజువారికి మాకు చాలాపగలూ యున్నాది
పెద్దలనాటి పగలుమాకు పెరుగుతుయున్నాది
మాకుమీకు పగలులేదయ్యా దుబాసిలక్ష్మయ్యా
తూర్పుదేశముచూడను యిపుడు మీరేవస్తిరీ
కర్నాటక రాజులతోను కలహాము లేకుండా
వచ్చినవారు వచ్చినరీతి కోటకుపొన్నండి
ఈతూరిమన్నించుము బొబ్బిలికోటాను
మేముయిచ్చే వుల్పాలన్ని మీరుతీసుకోని
ఈరీతిగా చెప్పుమయ్యా ధర్మారాయుడా
రాయభారము కుదరకపోతే పిమ్మటజూతాము
శెలవులుపొంది వస్తున్నాడు ధర్మారాయుండు
తులసినందనవనములోకి కదలివచ్చినారు
నందనవనములో చల్లగాను తీర్థమాడినారు
ఆరుఘడియలు అంబపూజ మూడుగళ్ళు జేసె
హరిపూజ శివపూజ తానుతీర్చుకొని
పట్టుకోటలో గోపాలస్వామిని మదిలోన దలచెను
రాజదివాణము వచ్చినాడయ్యా ధర్మారాయుండు
పంచభక్ష్యపరమాన్నముతోను అన్నముతినెను
[illegible]లపుడు చేతికందెను ధర్మారాయుండు
తమ్ముగో[illegible]చె రాణువు[illegible] తానుబిలచినాడు

అన్నలార దమ్ములార ఎల్మాబిడ్డలూ
ప్రాంచివారి డేరావద్దకు సంధికి బోదాము
నాతోకూడ రావలెనయ్యా ఎల్మాబిడ్డలు
ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండు
మంచిదన్నారు బాగన్నారు ఎల్మాబిడ్డలు
వారివారి విడిదికి అపుడు కదలివచ్చినారు
పంచభక్ష్య పరమాన్నముతో అన్నము తినెను
జాజిపువ్వుల జల్లడములు జగ్గున దొడగిరి
గాసిమీరిన వీరగానులు నడుమున గట్టిరి
వెండికట్లలు సొగసుగవారు చేతబట్టినారు
చేతులయందున సోపుకర్రలు సొగసుగ బట్టినారు
తాలాపట్టాకత్తులవారి సంకన వేసిరి
జంటుకు పన్నెండాయుధములతో ప్రయాణమైనారు
ధర్మారాయుడు బేటికివారు పరుగున వచ్చిరి
వందనమయ్యా వందనమయ్యా ధర్మారాయుడా
తామసంబు యింకాయేల తయారుగరన్నండీ
ఈరీతిగా చెప్పినాడూ ఎల్మాబిడ్డలు
ఎల్మాబిడ్డల శృంగారింపుదా కన్నుల జూచేను
ఘల్లుమని నవ్వినాడు ధర్మారాయుండు
అప్పుడేమని చెప్పినాడయ్యా ధర్మారాయుండు
భారా తేజినీ యిపుడు మీరు బేటికి తెన్నండి
నేలమిద్దెలో భూమికావులో తేజ యున్నాది
శృంగారించి తీసుకరండి కొలువుకు యిప్పుడూ
ఈరీతిగా చెప్పినాడు ధర్మారాయుండు
పన్నెండుమంది కాపుదారులు గొబ్బున వచ్చిరి
వేసినారయ్యా తేజికక్కడ వెండిపల్లెములు
జడలుఅల్లి జుట్లుగుండులు సొంపుగ వేసిరి
మెడమీాదజుట్టి గుండ్లు సొంపుగ అల్లిరి
ఉషూయిపీట కలికితురాయి చందమామచెక్క

పట్టు త్రాళ్ళతో గట్టినారయ్యా బారా తేజిని
తేజియొక్క శృంగారమే కన్నులచూచేను
పాదములకు పూజించినాడు ధర్మారాయుండు
కూర్మికుచ్చున పల్లకి యపుడు బైటబెట్టినారు
పల్లకి లోపల కొలువుతీరెను ధర్మారాయుండు
పన్నెండుమంది బోయవార్లు పల్లకిబట్టిరి
పల్లకిప్రక్క వస్తున్నారు ఎల్లామబిడ్డలు
పల్లకిప్రక్క వస్తున్నాది బారా తేజీదా
హరిరామా శ్రీరామాయంటా కోటవిడిచినారూ
కోటగవినికి వచ్చినపుడు గోవింద బెట్టిరి
కోటదాటి వచ్చినాడయ్యా ధర్మారాయుండు
కత్తులవార ఆపుడు తిరుగుతుయున్నారూ
దొంగజేరువో పారాలన్ని తిరుగుతుయున్నాడూ
మూడువేల ముకుందబలము పారావున్నారూ
రెండువేల సోల్జరువారు పారాయున్నారూ
నల్లమంద అనువులవద్ద పారాయున్నారూ
అనువుకాడనే వచ్చినాడయ్యా ధర్మారాయుండు
ఆవెంబడి వస్తున్నారు ఎల్లామబిడ్డలూ
ఆవెంబడి వస్తున్నాది బారా తేజిదా
అనువులకాడ అటకాయించిరి ధర్మారాయున్ని
యెవరు యెవరు మీరు యిపుడు పారాకొస్తిరి
ఈరీతిగా అడిగినారయ్యా పారాచౌకీలు
అప్పుడేమని చెప్పినాడయ్యా ధర్మారాయుండు
బొబ్బిలివారి దివానగిరి ధర్మారాయున్ని
బొబ్బిలివారి దివానమైతే యెందుకువస్తివీ
మీరువచ్చిన కార్యమేమి తెలియచెప్పుమాకూ
పోనీవమయ్యా పోనీవమయ్యా ధర్మారాయుడా
ప్రాంచివారి యుత్తరువులేక బాటలు విడువామూ
రాజుగారి యుత్తరువులేక బాటలు యివ్వమూ

కిటకిటకిటకిట పారాకమ్మిండి
రెండు వేల ముకుందబల్యము పారాకమ్మినారూ
మూడు వేల ముకుందబల్యము పారాకమ్మినారు
పారామధ్య చిక్కినాడయ్యా ధర్మారాయుండు
అన్నలార తమ్ములార పారాచౌకీలు
యుద్ధమునకు రాలేదయ్యా పారాచౌకీలు
ప్రాంచివారి డేరావద్దకు సంధికిపోతాను
రాయభారము కుదిరితేను కోటకుపోతాను
రాయభారము కుదరకపోతే పారాచౌకీలు
యెచ్చరించి నేను కోటకు అపుడు రాయిగపోతాను
యుద్ధానికి రావలెనంటే కోటకు రన్నండీ
వారివారి బలముల అచ్చట జూతామూ
ఇంతేకాని యికయేమిలేదు పారాచౌకీలు
ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండు
బోనివ్వము బోనిప్పము ధర్మారాయుండా
రాజుగారి వుత్తరువులేక దోవలు విడువాము
ప్రాంచివారి వుత్తరువులేక దోవలువిడువామూ
గుంపువచ్చి కమ్ముకొన్నారు పారావారూడా
పారాలన్ని తోడుకొండా వస్తున్నాడు
వారివెంబడి వస్తున్నారు యెల్మాబిడ్డలు
యెలమలప్రక్క తిరిగిజూచె ధర్మారాయుండు
కన్నుసైగ చేసినాడయ్యా ధర్మారాయుండు
అపుడేమని చెప్పినారయ్యా యెల్మాదొరలు
యుద్ధమునకు రాలేదయ్యా పారాచౌకీలు
చుట్టుకమ్మి పారాలపుడు వస్తున్నారూ
మంచినీళ్ళ బావికాడ పారాకమ్మేను
రాజుయొక్క వురవడి జూచిరి పారాచౌకీలు
అక్కడక్కడ పారాలన్ని వెనుకకు తీసిరి
అపుడెట్లా వున్నాడయ్యా దుబాసి లక్ష్మయ్యా

డేరాబైట కుర్చీమీద కొలువై యున్నాడు
పల్లకిమీద వచ్చెడిరాయుని కన్నుల జూచెను
వారినిచూచి దిగ్గున లేచే దుబాసి లక్ష్మయ్య
యెదురుసేవకు యేడడుగులు మ్ముందుగ నడిచేను
పల్లకిలోపల యుండేరాయుడు కన్నులచూచేను
ఉడాను వేసి భూమిలో దూకెను ధర్మారాయుండు
ఏడడుగులు ముందునడచేను ధర్మారాయుండు
అప్పుడేమని చెప్పినాడయ్యా దుబాసి లక్ష్మయ్య
యెవరుమీరు యెవరుమీరు డేరాకొస్తిరి
ఈరీతిగా బలికినాడయ్యా దుబాసి లక్ష్మయ్య
రంగరాయుని బావమరిది ధర్మారాయున్ని
మాయింటిపేరు దాదులవారు వినుము యిపుడుదా
ఈరీతిగా చెప్పినారయ్యా ధర్మారాయుడు
యెందుకొస్తి యేలవస్తి ధర్మారాయుడా
దివానమొచ్చి దిగినాడంటే బేటికి వస్తిమి
యీలాగు చెప్పినాడయ్యా ధర్మారాయుడు
చాలుచాలు నిలువుమయ్యా ధర్మారాయుడా
దివాణమంటె పర్వావున్నాదా బొబ్బిలిదొరలకు
దివాణమంటె భయమున్నాది బొబ్బిలిదొరలాకు
అనకాపల్లెలో వుండిమేము జాబులు వ్రాస్తిమి
యెదటిసేవకు రమ్మని మీకు జాబులు వ్రాస్తిమి
యెదటిసేవకు రాకపోతిరి బొబ్బిలి దొరలుదా
మీవంటి జాబులకంతా జాబులు పంపితిమీ
జాబులుచూచిన తక్షణంబు ధర్మారాయుడా
యెదురుసేవకైనా యెదురై యెదురుగా వచ్చిరి
యీరీతిగా చెప్పినాడయ్యా దుబాసిలక్షుమయ్య
అప్పుడేమని చెప్పినాడండి ధర్మారాయుండు
పరాకుంచక వినుము యిపుడు దుబాసిలక్షుమయ్యా
మీరువ్రాసిన జాబులైతే మాకు చేరలేదు

మీరువచ్చినసంగతులు మాకు తెలియకపోయె
వెంగళరాయుని పెండ్లియందు మేము వుంటిమి
నగరాశబ్దము విన్నతోడనే వేటికివస్తిమి
ఢంకాశబ్దము విన్నతోడనే వేటికివస్తిమి
పరాకుంచకవినుముయిపుడు దుబాసిలక్షుమయ్యా
రాజుగారికిమాకు నిండా పగలుయున్నాది
మాకుమీకు పగలులేదయ్యా గ బాసిలక్షుమయ్యా
రాజుమాటలు వినుటమీకు న్యా యముకాదయ్యా
చిన్నబిడ్డలు చిరుబాలురతో కోటలోయున్నాము
కోటమీదికివచ్చుట మీకు న్యాయము కాదయ్యా
ఆరులక్షల పైకము అగపులిస్తాము
ఇచ్చట వచ్చినందులకు లక్షయినాములిస్తాము
మజిలియొక్కటి లక్షపైకము మేముగట్టుతాము
సిబ్బందీఖర్చు నెలవులంతా మేముకట్టుతాము
కర్నాటకంచూడను రాజా మీరేవస్తిరి
కర్నాటకం దొరలతో గల్బాయేలయ్యా
అంబారి పెద్దయేనుగు యినాము యిస్తాము
వచ్చినవారు వచ్చినరీతి పుదుచ్చేరి పొన్నండి
నేను తెచ్చిన వుల్బాలంత మీరుచేకొనండి
యీతూరి బొబ్బిలికోటను చాలా మన్నించండి
యీరీతిగా చెప్పినా డయ్యా ధర్మారాయుడు
అట్టిమాటలకు యేమన్నాడు దుబాసిలక్షుమయ్యా
రాజుమాటలు ఫ్రాంచిమాటలు యొకటైయున్నాది
రాజుగారికి బొబ్బిలికోటకు పర్మనిచ్చును
చెప్పితేను తప్పేదిలేదు ఫ్రాంచిదొరగారు
సంధికివచ్చినందుకు యిమిసాటము లేదయ్యా
వచ్చినవారు వచ్చినట్టు కోటకుపొన్నండి
రాజుగారికి పట్టంగట్ట ఫ్రాంచిపోతారు
వెనుకవచ్చి చెంపలుకొట్ట కోటలుతియ్యండి

ఇంతేకాని యికయేమిలేదు ధర్మారాయుండా
ఈరీతిగా చెప్పినాడయ్యా దుబాసిలక్షుమయ్యా
యెక్కడలేని కోపమువచ్చె ధర్మారాయుడికి
పటపటయని పండ్లుకొరికెను ధర్మారాయుండు
పరాకుంచక వినుముయిప్పుడు దుబాసిలక్షుమయ్యా
ఒకరిపట్నం ఒకరికి యెవరికి కొడుకురా
రాజమహేంద్రం జిల్లాలోనే ప్రాంచిదొరగారు
రాజుగారికి బొబ్బిలికోటలు పర్మానిచ్చెను
రాజుగారికి పట్టముగట్టి తానేపోతాడు
పుట్టినచోట చావడానికి బ్రహ్మ వ్రాయలేదు
బొబ్బిలిమీద చావడానికి వానికివ్రాసెను
చెప్పితేను తప్పేదిలేదు ప్రాంచిదొరగారు
అటువంటి నీతిపురుషుడు ప్రాంచిదొరగారు
పుదుచ్చేరి యిప్పుడేకదా రాజుగారికై
రాజుగారి ఆపట్నమె పట్టముగట్టరాదా
బొబ్బిలివారికి పట్టంగట్టి పోవచ్చినాడూ
తనలోతాను తామసించుకొని ధర్మారాయుండూ
పరాకుంచక వినుము యిపుడు దుబాసిలక్ష్మయ్యా
వ్రాసిస్తేను సంతోషమాయెను దుబాసిలక్ష్మయ్యా
ప్రాంచినాకు బేటిచేయించు దుబాసిలక్ష్మయ్యా
యొకటిరెండు మాటలవల్ల మాట్లాడిపోతానూ
రాయభారము కుదిరితేను కోటకుపోతానూ
యీరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండూ
ప్రాంచీకినీకు బేటికిచేయిస్తె నాకేమియిస్తావూ
ఆమాటలకే నవ్వినాడు ధర్మారాయుండు
లంచముతీసే బుద్ధులునీవు మానకపోతివి
చేతనున్న పచ్చలకట్ట చేతనిచ్చేనూ
రెండుసంచులవరాలు యపుడు సదరుజోసినాడూ
అచ్చాబాదలు యున్నాకయ్యా ధర్మారాయున్ని

యెందుకు దొరలు బేటికివచ్చి యిట్లులేదయ్యా
నీవురాను భయమున్నది దండుకు లోగానూ
నీమాటలకు నేమన్నాడు రాయుండూ
నాకుమించినవారున్నారూ దండుకు లోగానూ
పరాకుంచక వినుము యిపుడు ధర్మారాయుడా
కల్లుసారాయి త్రాగినారు కయిపున వుంటారూ
వొళ్ళు తెలియక మరచి వుంటాడయ్యా ప్రాంచిదొరగారూ
కుర్చీమీద తూగుతువుంటాడు ప్రాంచిదొరగారూ
ప్రాంచివారి డేరాకుబోయి నేనేవస్తాను
ఘడియసేపుదా నిదానించుము నాడేరాలోగా
మంచిదన్నాడు అప్పుడయ్యా ధర్మారాయుండూ
యచ్చటనుండి ప్రయాణమాయెను దుబాసిలక్ష్మయ్యా
గరుడపక్షిల పల్లకిమీదు వస్తువున్నాడూ
ప్రాంచివారి డేరావద్ద డాకీలైనాడూ
అప్పుడెట్లా వున్నాడయ్యా ప్రాంచిదొరగారూ
తీనియపుడు తింటున్నాడు ప్రాంచిదొరగారూ
పల్లకివిడిచి యెదురువచ్చెను దుబాస లక్షుమయ్యా
సలామయ్యా సలామయ్యా ప్రాంచీదొరగారు
సలామనగా టోపీయెత్తి సలాముచేసేనూ
బైటోఅనగా కొలువుతీరెను దుబాసి లక్ష్మయ్యా
యెందుకు యిచ్చట వచ్చినావు దుబాసి లక్ష్మయ్యా
ఈరీతిగా అడిగినారయ్యా ప్రాంచీదొరగారూ
అట్టిమాటలకు యేమన్నాడు దుబాసి లక్ష్మయ్యా
పరాకుంచక వినుము యిపుడు ప్రాంచీదొరగారు
బొబ్బిలివారి దివాణమంటా ధర్మారాయుండు
రాయభారమె వచ్చినాడయ్యా ధర్మారాయుండు
తీనియపుడు తింటున్నాడు ప్రాంచీదొరగారూ
పచ్చలకుర్చీ వేయించుము ధర్మారాయుడికీ
యెదురుసేవకు మీరు నడవండి ముందుగ యిపుడుదా

చెయ్యితోను చెయ్యిపట్టి డేరాకు పిలువండి
యిద్దరువొక్క కుర్చీమీద కొలువుతీరండి
ఒళ్ళుమరచి యేమాటన్నైన నేను చెప్పితేను
ఓర్చియుండేవారు ధర్మారాయుండు
సరిదారిబిడ్డ వాడైనయ్యా ధర్మారాయుండు
మర్యాద చేయకపోతే ప్రాంచీదొరగారూ
డేరాలోపల గోరిపెట్టి పోటుకు పోతాడు
ఈరీతిగా చెప్పినాడయ్యా దుబాసిలక్ష్మయ్యా
ఆమాటలకు యేమని చెప్పెను ప్రాంచిదొరగారూ
యెన్నిమందలు తెచ్చినారయ్యా ధర్మారాయునితో
ధర్మారాయుడు పేరుచెప్పగానె సల్లగుండె పగిలె
పరాకుంచక వినుము యిపుడు దుబాసి లక్ష్మయ్యా
పరాకుంచక వినుము యిపుడు ప్రాంచీదొరగారూ
యాభైముగ్గురు యెలమలతో ఆతడే వచ్చెను
ఆమాటలు విన్నాడయ్యా ప్రాంచిదొరగారూ
గడగడగడగడగడగడవణకేను ప్రాంచిదొరగారు
ఆరునిమిషంబుల తీసినాడయ్యా ఆరినిబళ్ళారి
మూడునిమిషంబుల తీసినాడు మూడేదుర్గాలూ
యాభైమువ్వురు ఎలమలతో రాయుడువస్తాడా
పరాకుంచక వినుము యిపుడు దుబాసిలక్ష్మయ్యా
అయిదుగురితో రమ్మనిచెప్పు నా డేరాలోగాను
తక్కినవారికి నీడేరాలోనా తావియ్యగ పెట్టండి
ఈరీతిగా చెప్పినాడయ్యా ప్రాంచిదొరగారు
ఈమాటలు విన్నాడయ్యా దుబాసిలక్ష్మయ్యా
గరుడపచ్చల పల్లకి యెక్కి తాను వస్తున్నాడు
రాయుడిబేటికి యెదుటవచ్చె దుబాసిలక్ష్మయ్యా
పోయినపనులు యేమాయెను దుబాసిలక్ష్మయ్యా
పరాకులేక వినుము యిపుడు ధర్మారాయుండా
ప్రాంచిదొర డేరావద్దకు నేను పోతిని

చెప్పవలసిన మాటలన్ని నేనే చెప్పితిని
ఐదుగురితో రమ్మన్నాడు డేరాలోగాను
కొంతమందిని నాడేరావద్ద ఠాయిగ వుంచమన్నాడూ
ఈరీతిగా వుత్తరువు తెస్తె ధర్మారాయుండా
సంతోషించి నిలిచెనయ్యా ధర్మారాయుండూ
యాభైమువ్వుడు యల్మాదొరల యేర్పరచినాడూ
ఇన్నూటితొమ్మిది సరదారి బిడ్డగా యేర్పరచినాడూ
ఐదుగురు యల్మాబిడ్డల యేర్పరచినాడూ
పరాకుంచక వినండిమీరు యెల్మాదొరలూండా
ప్రాంచివారి డేరావద్దకు సంధికి పోతామూ
నాతోకూడ రావలెనయ్యా యెల్మాదొరలుండా
యట్టిమాటలు చెప్పినాడయ్యా ధర్మారాయుండూ
ఐదుగురు యెల్మాదొరలను వెంటతీసుకొని
మాణ్కికుచ్చుల పల్లకెక్కెను ధర్మారాయుండూ
పల్లకెక్కి వస్తున్నాడు ధర్మారాయుండూ
పల్లకివెంబడి వస్తుంది బారాతేజిదా
పల్లకి కమ్మినారు యెల్మాదొరలువా
ఈరీతిగా ప్రయాణమాయెను ధర్మారాయుండు
అప్పుడేమని చెప్పినాడయ్యా ధర్మారాయుండా
అన్నలార తమ్ములార యల్మాబిడ్డలు
ప్రాంచివారి డేరావద్దనే సంధికి పోతాను
రాయభారము కుదిరితేను కోటకు పోతాము
కానిపోని మాటలవలన కలహాం వస్తేను
చేతనుండు డేగనుమీరు కోటకు విడిచిదా
క్రిందుమీదు చెయ్యండయ్యా ప్రాంచిడేరాలు
బాకువల్ల డేరాలంతా ఠాయిగ చింపండి
ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండూ
యచ్చటనుండి వస్తున్నాడు ధర్మారాయుండూ
ప్రాంచివారి గుడారంజూచి వస్తున్నాడు

అతనికి వెంబడి వస్తున్నాడు దుబాసి లక్ష్మయ్యా
రాయుడువచ్చె వేగముజూచె ప్రాంచిదొరగారూ
గడగడగడగడ వణకి తానునిలచె ప్రాంచిదొరగారూ
టోపిమెత్తి చేతబట్టె ప్రాంచిదొరగారూ
యెదురుసేవకు యేడడుగులువచ్చె ప్రాంచిదొరగారూ
మూడుమారులు సలాముచేసె ప్రాంచిదొరగారు
అప్పుడెట్లా వున్నాడయ్యా ధర్మారాయుండు
పల్లకివిడిచి ధర్మారాయుండు భూమినదూకేను
చెయ్యితో చెయ్యిబట్టి డేరాకు వచ్చేనూ
కుర్జీమీద కొల్వుతీరెను ధర్మారాయుండు
ఆవెంబడి వస్తున్నాడు దుబాసి లక్ష్మయ్యా
ధర్మయ్యకు భూమిలైనాడు దుబాసి లక్ష్మయ్యా
ఇంగిలీషుతో చెప్పుతున్నాడు దుబాసిలక్ష్మయ్యా
రాజుమాటలు వినేదిమీకు న్యాయము గాదయ్యా
రాజుగారికి బొబ్బిలివారికి పగలేయున్నాదీ
బొబ్బిలివారికి మనకే యిపుడు పగలులేదండీ
పెద్దలనాటి పగలు యిప్పుడు తూగుతుయున్నాదీ
తూరుపుదేశము చూడను యిపుడు వస్తిమీ
కర్నాటక దొరలవద్ద కలహాము లేకుండా
వచ్చినటుల పోదమయ్యా కోటకు యిపుడుదా
బొబ్బిలియైతే యిన్నిదినములు మూడులక్షలుదా
ఆరులక్షలపైకామిపుడు అగావు కడుతార
ఇక్కడ వచ్చినందుకు యినాము లిస్తాడు
మజిలీ మజిలీకైనా లక్షలు యిస్తాడు
సిబ్బందిఖర్చు సెలవులంతా వారే యిస్తారూ
అంబారి పెద్దయేనుగు యినాము యిస్తారు
ఈతూరి మన్నించుదాము బొబ్బిలికోటదా
పరాకుంచక వినండి యిపుడు ప్రాంచిదొరగారు
గోల్కొండ బాషావిన్నాను మాటలు వచ్చాను

కర్నాటక దొరలవద్ద కలహము లేకుండా
వచ్చినవారు వచ్చినరీతిగ మనమే పోతాము
ఈరీతిగా చెప్పినాడయ్యా దుబాసిలక్ష్మయ్య
అట్టిమాటలకు యేమన్నాడు ప్రాంచిదొరగారూ
పరాకుంచక వినుము యిపుడు దుబాసిలక్ష్మయ్యా
నన్నునమ్మి వచ్చినాడు విజయరామరాజూ
రాజువద్దకు సంధికిపుడు ధర్మారాయుణ్ణి
రాజుగారు ధర్మారాయుడు స్నేహితమైతేను
ఈక్షణమే పోదామయ్యా పుదుచ్చేరికిదా
యింతేగాక యికవేరే లేదు దుబాసిలక్ష్మయ్యా
యీరీతిగా చెప్పినాడయ్యా ప్రాంచిదొరగారు
అట్టిమాటలు తెలుసుకొన్నాడు ధర్మారాయుండు
చాలుచాలు లేచిపోవోయి ప్రాంచిదొరగారు
ప్రాణముతోను రాజువద్దకు నేనే పోనండీ
సెలవిచ్చితె సంతోషముమె ప్రాంశీలబూచి
సెలవులు అయిన యివ్వకపోతే ప్రాంశీలబూచి
లక్షాతొంబై వేల దళవాళ్లో మీరువచ్చినారూ
యిరువై నాలుగువేల దళములతోను రాజువచ్చినాడు
యాబైమువ్వురు యు[illegible]మదొరలతో నేను వచ్చినానూ
నీమందుగుండు హరా[illegible]కులను దూరంగపెట్టండీ
అంబారి యేనుగమీద హవుదా పన్నింతూ
హవుదాలోపల ముత్యాలపందిళ్ళు ముందుగ వేయిస్తు
హవుదాలోపల కొలువుయుండడము ప్రాంశీలబూచి
రాజుగారి సైన్యమంతా షికారు త్రిప్పించి
నాయొక్క సైన్యములన్ని బారు త్రిప్పించి
రాజుసైన్యమునకు నాసైన్యమునకు లడాయి పెట్టండీ
లడాయిపెట్టి తమాష యిపుడు కన్నుల జూడండీ
రాజుగారు గెలచితె బొబ్బిలికోట రాజుకు ఇవ్వండి
నేనుగెలిచితే విజయనగరము నాకే యివ్వండి

ఇంతేగాక యికయేమీలేదు ప్రాంచిదొరగారు
పరాకుంచక వినుము యిపుడు ప్రాంచిదొరగారు
మాకుమీకు పగలులేదయ్యా ప్రాంచిదొరగారు
రాజుమాటలు లేదయ్యా ప్రాంచిదొరగారు
లడాయిపెట్టి తమాష యిపుడు కన్నులజూడండి
రాజుగారుగెలిచితె బొబ్బిలికోట రాజుకు యివ్వండి
నేనుగెలిచితె విజయనగరము నాకే యివ్వండి
ఇంతేగాక ఇకయేమిలేదు ప్రాంచిదొరగారు
పరాకుంచక వినుము యిపుడు ప్రాంచిదొరగారు
మాకుమీకు పగలేదయ్యా ప్రాంచిదొరగారు
రాజుమాటలు వినుటమీకు న్యాయము కాదయ్యా
కోటమీద వచ్చేదిమీకు న్యాయముకాదయ్యా
ముసలి ముతకలతోటి కోటలో వున్నాము
ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుడు
అట్టిమాటకు యేమన్నాడు ప్రాంచిదొరగారు
చాలుచాలు లేచిపోవోయి ధర్మారాయుడా
బెట్టుమాటలు విడువుమయ్యా ధర్మారాయుడా
నమ్మవచ్చినవానిని నేను ద్రోహము చేయను
నాచేతిలో వాని నేను పట్టిచూపను
పాలకొండ మన్యాలభూమి భాగుచేసుకోని
రాజస్త్రీల తీసుకొని వల్సలు పోన్నండీ
రాజుగారికి పట్టముగట్టి నేనుపోతాను
అవతలవచ్చి చొపలగొట్టి కోటలు తీయండి
యింతేగాక యికయేమిలేదు ధర్మారాయుడు
చెప్పితేను తప్పేది లేదు ప్రాంచిగుంపుదా
అట్టిమాటలకే కోపముగలిగె ధర్మారాయుడికి
వెంట్రుకలంతా చెల్లించెను ధర్మారాయుడికి
కుర్చీవిడిచి ధర్మారాయుడు భూమిన దూకేను
చేతనున్న డేగాపట్నము కోటకువిడిచెను

డేగలాగు దూకినారయ్యా డేరాలోగాను
డేరా టంగుత్రాళ్ళను యపుడు తెగగొట్టినారు
బాకుయెత్తి చేతబట్టి డేరాచించిరి
వోరియిప్పుడు చెప్పినమాటలు మరల చెప్పరా
రాజస్త్రీల తీసుకొని వల్సెనుపొయ్యేదా
ప్రాణముతోను నిన్నుపోనిస్తానా ప్రాంచిసిన్నదా
ఆడితేను తప్పేది లేదా మాకేలంటేను
అటువంటి సత్యవంతుల సీవేలయితేను
పుదుచ్చేరి రాజుగారికి పట్టము గట్టించి
సిదుస్త్రీలనుతీసుకొని వల్సెలుపోరాదా
యొకరియిల్లు యొకరికివ్వరు యెవ్వరికొడుకురా
నన్నునమ్మి వచ్చినాడా విజయరామరాజు
వానితాతతండ్రులు ముందుగ హాతమైపోయినారు
తుమ్మలగుంట యుద్ధము నాడు జగన్నాధరావు
లక్షాలక్షా దండులోను హాతమైపోయినాది
జలుజపాటి యుద్ధమునాడు జగన్నాధరావు
ఏడువేల యేన్నూటిదండు హాతమైపోయినాది
రాజుగారికి వ్రాసియున్నది బొబ్బిలిమీదను
బొబ్బిలివారిచే చావమువారికి పంతమున్నాది
పుట్టినచోటు చూపడానికి బ్రహ్మవ్రాయలేదు
తట్టుకోటకు బలియిచ్చెద రాజుగారినిదా
పన్నెండేడులు సాము చేసితి సాధనగరిడీలో
లాయమందున్న బారాతేజికి లగువులుచిక్కింది
తుక్కుపట్టిన పట్టాకత్తికి తుక్కువలింది
ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండు
మొలనున్న పచ్చిబాకు జబ్బునదీసెను
కూసినకూత మరల యిపుడు యెర ప్రాంచిదా
కూసిననోరు కూయకండి నోటిసపొడుస్తాను
కత్తిమొనపులే మెరయుచును ధర్మారాయుండు

అప్పుడెట్లా వున్నాడయ్యా ఫ్రాంచిదొరగారు
ధర్మారాయుడికి కత్తిమెరుపులే కన్నులచూచెను
కత్తిమెరుపులే కన్నులచూచి కలవరబడినాడు
దిగులుజెంది నిలచినాడయ్యా ఫ్రాంచిదొరగారు
కుర్చీవిడిచి ఫ్రాంచిదొరగారు గొబ్బునదూకేను
డేరాస్తంభము మరుగునబోయెను ఫ్రాంచిదొరగారు
అప్పుడేమని చెప్పినాడయ్యా దుబాసిలక్ష్మయ్యా
నమ్మితినయ్యా నమ్మితినయ్యా దుబాసిలక్ష్మయ్యా
కోరుపులి తెచ్చి నీవుడేరాలో బెట్టితివి
నాదుపంతము తప్పించగా దుబాసిలక్ష్మడా
మూడుపల్లెలు యినాములిచ్చెద దుబాసిలక్ష్మడా
యీలాగున ఇంగిలీషుతో ఫ్రాంచిచెప్పెను
ఈమాటలు విన్నాడయ్యా దుబాసిలక్ష్మయ్యా
కుర్చీవిడిచి లక్ష్మయ్యా గొబ్బునదూకెను
గొబ్బునబోయి బట్టినాడయ్యా ధర్మారాయున్ని
చేతకత్తిని బట్టినాడయ్యా దుబాసిలక్ష్మడు
తామసించురా నిదానించురా ధర్మారాయుడు
యెప్పటివలెనే బొబ్బిలికోట డాగియున్నాడు
కపటమాటలు చెప్పినాడయ్యా దుబాసిలక్ష్మయ్యా
యెత్తినకత్తి దించుమీదనే తాయిగపొడిచేను
చకురువిడిచి లేచినాడయ్యా ధర్మారాయుండు
డేరావిడిచి బైటికొచ్చెను ధర్మారాయుండు
యీబై ముగ్గురు యెల్లమ్మదొరలను వెంటపిలచెను
అప్పుడేమని చెప్పినాడయ్యా దుబాసిలక్ష్మయ్యా
పరాకుంచక వినుము యిపుడు ధర్మారాయుడా
కల్లుసారాయి త్రాగి కైపునవుంటారు
మంచిసంగతులు తెలుసుకొని నేనువస్తాను
నిమిషమైనా నాడేరావద్ద మీరేయుండండి
యీరీతిగా చెప్పెను యపుడు ధర్మారాయున్ని

తనడేరావద్దకు పంపినాడయ్యా ధర్మారాయున్ని
రాజువద్దకు పంపినాడయ్యా దుబాసిలక్ష్మయ్యా
వందనమయ్యా వందనమయ్యా విజయరామరాజు
బొబ్బిలివారి దివాణమంటా ధర్మారాయుండు
రాయభారము వచ్చినాడయ్యా ప్రాంచివద్దకు
రాయభారము వొప్పకపోతే ప్రాంచిదొరగారు
ప్రాంచివారిని నిరాకరించి కోటకుబోతాను
దండుకులోగా బోతున్నాడు ధర్మారాయుండు
దండులోజొచ్చిన ధర్మారాయుడు కోటకుబోతేను
పన్నెండుఏండ్లు సోగుచేసిన కోటలు తియ్యలేము
ఈరీతిగ చెప్పినాడయ్యా దుబాసిలక్ష్మయ్యా
ఈమాటలు విన్నాడయ్యా విజయరామరాజు
ధర్మయ్యానగా నల్లగుండెలు తారునపగిలెను
చదురువిడిచి లేచినాడయ్యా విజయరామరాజు
ప్రాంచివారి డేరావద్దకు వస్తున్నాడు
రెండులక్షల వరహాలపుడు సదరుమెత్తుకొని
ప్రాంచివారి బేటికివచ్చి వందనమొసగెను
వందనమయ్యా వందనమయ్యా ప్రాంచిదొరగారు
యీరీతిగా చెప్పినాడయ్యా విజయరామరాజు
రెండులక్షల వరహాలపుడు సదరుబోసినాడు
అప్పుడుయేమని చెప్పినాడయ్యా ప్రాంచిదొరగారు
కంబైటో కంబైటో విజయరామరాజు
బైటోయని చెప్పినంతలో విజయరామరాజు
అట్టివేళలో చెప్పినాడయ్యా విజయరామరాజు
నాదుమనవి చిత్తగింపుము ప్రాంచిదొరగారు
అట్టిమాటలకు యేమన్నాడు ప్రాంచిదొరగారు
బొబ్బిలివారి దివాణమంటా ధర్మారాయుండు
రాయభారమే వచ్చినాడయ్యా ధర్మారాయుండు
రాయభారమే వొప్పకబోతిని విజయరామరాజు

లేనిమాటలు యెత్తిబలి్కి కోటకుబోతాడు
కోటకుబోతే యేమిచేతునో ధర్మారాయూడు
పేరుజెందిన సరదారిబిడ్డ ధర్మారాయూడు
అప్పుడుయేమని చెప్పినాడయ్యా విజయరామరాజ
దండుకొచ్చిన ధర్మారాయుండు కోటకుబోతేను
పన్నెండుఏండ్లు పోరుచేసిన కోటలుతియ్యాము
బొబ్బిలికోటను పోరుసింహము ధర్మారాయుండు
మాటలవల్ల చంపుతున్నాను ధర్మారాయున్ని
శెలవివ్వండి శెలవివ్వండి ఫ్రాంచిదొరగారు
ఈరీతిగా చెప్పినాడయ్యా విజయరామరాజు
అట్టివేళలో ఫ్రాంచివారు మాబాగన్నారు
అక్కడనుంచి వచ్చినాడయ్యా విజయరామరాజు
డేరా విడిచి వచ్చినాడయ్యా విజయరామరాజు
రుమాలుగుడ్డ తలలోగట్టె విజయరామరాజు
దండుకుమొన సుబేదారుని యప్పుడుబిలచెను
నన్ను బిలిచిన కార్యమేమి విజయరామరాజు
పరాకులేక వినుముయిపుడు హైదరుజంగోజి
పోతున్నాడు పోతున్నాడు ధర్మారాయుండు
ఫ్రాంచివారి డేరావద్దకు సంధకవొచ్చినాడు
రాయభారము వొప్పకపోయె ఫ్రాంచిదొరగారు
బూచిగారిని దూరినాడు పోతున్నాడు
దండుకులోగ పోతున్నాడు ధర్మారాయుండు
మల్లించండి మల్లించండి ధర్మారాయున్ని
మాటలచే పట్టిపెట్టుము ధర్మారాయున్ని
పట్టికట్టి బంధించిదా సాబేటికి తెన్నండి
నిమిషములోన చంపవలెను ధర్మారాయుని
మాటలవలన చిక్కిపోతె ధర్మారాయుని
పారాలమీద నే చంపవలెను ధర్మారాయుని
ఈరీతిగా చెప్పినాడయ్యా విజయరామరాజు

ఈమాటలు విన్నాడయ్యా హైదరుజంగోజి
ధర్మారాయుని కడ్డమైనారు పారాచౌకీలు
కన్నుసైగ చేసినారయ్యా పారాచౌకీలు
గుంపువచ్చి కమ్మిందయ్యా పారాయప్పుడు
మూడువేల ముకుదబల్యాను పారాకమ్మినారు
రెండువేల సోల్జర్లును పారాకమ్మినారు
పోనీమయ్యా పోనిమయ్యా ధర్మారాయుడా
రాజుగారి వుత్తరువు లేక బాటలువిడువను
ఫ్రాంచివారితో పందాలు వేసి కోటకుపోతావు
పారామధ్య చిక్కినావురా ధర్మారాయుడా
అప్పుడేమని చెప్పినాడయ్యా ధర్మారాయుడా
అన్నలార తమ్ములార పారాచౌకీలు
రాయభారము వచ్చినాను ఫ్రాంచిబేటికి
రాయభారము కుదర లేదు పోతూవున్నాను
యుద్ధమునకు రా లేదయ్యా పారాచౌకీలు
వారివారి బలమంతయు కోటలో చూతాము
యింతేగాక యింకేమిలేదు పారాచౌకిలు
యీరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండు
అట్టిమాటలకు యేమంటారు పారాచౌకీలు
నిన్నుబట్టి గట్టి తెమ్మన్నారు బేటికిముమ్మిదా
ఈరీతిగా చెప్పినాడయ్యా హైదరుజంగోజి
యట్టిమాటలు విన్నాడయ్యా ధర్మారాయుండు
నన్నుబట్టి బంధించిరాజు బేటికి తెమ్మనెనా
నన్నుబట్టెడి మొగధీరులు దండులోయున్నారా
నన్నుబట్టె సుబేదారులు దండులోయున్నారా
దండులోక్కడ యున్నాడయ్యా హైదరుజంగోజి
కన్నుసైగ చూపించిర యప్పుడుజూచెద
ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండు
మాటవల్ల చిక్కలేదు ధర్మారాయుండు

కన్నుసైగ చేసినాడయ్యా హైదరుజంగోజి
కన్నుసైగ జూచినారు పారాచౌకీలు
యాబైరెండు తుపాకులాడ పెలితాలుంచిరి
తుపాకియొక్క శబ్దమువిన్నాడు ధర్మారాయుండు
వానివెంటనే వస్తువున్నాది బారాతేజిదా
ఉడాను వేసి యెగిరినాడు తేజిమీదను
ధర్మయ్యకు సక్రిగావారు రాయిగజూచిరి
పళపళమని రాల్చినారయ్యా టుపాకులంతాను
గొబ్బునయపుడు త్రిప్పినాడయ్యా తేజిని యపుడుదా
నాలుగుప్రక్కల త్రిప్పినాడయ్యా బారాతేజిని
యెగిరినాది యోజనపొడుగు తేజియప్పుడుదా
భూమిమీదనే బారినాదిర బారాగుండ్లుదా
తొలిదెబ్బ తప్పించుకొన్నాడు ధర్మారాయుండు
రెండవతూరి వచ్చినారయ్యా పారాచౌకీలు
పళపళయని కాల్చినారయ్యా తుపాకిలంతాను
అప్పుడెట్లా వున్నాడయ్యా ధర్మారాయుండు
నాలుగుప్రక్కల త్రిప్పుతున్నాడు బారాతేజిని
కాలుసైగ చేసినాడయ్యా బారాతేజిని
కాలుసైగ జూచినాదీర బారాతేజిదా
కదలక మెదలక భూమిపైగాను తానుతగ్గెను
తగ్గించిదాని నిలిపినాడు ధర్మారాయుండు
శిరస్సుమీద వెళ్ళిపోయెను బారగుండ్లుదా
మరుదెబ్బను తప్పించుకొన్నాడు ధర్మయ్యాదా
యింకను మనము జయించజాలము ధర్మయ్యానుదా
ఈరీతిగా చెప్పినాడయ్యా పారాచౌకీలు
అప్పుడేమని చెప్పినాడయ్యా హైదరుజంగోజి
యలమలబిడ్డల శిరస్సుజూచి టుపాకిలంతాను
వంచివంచి నిలువుమయ్యా టుపాకిలంతాను
యీరీతిగా చెప్పినాడయ్యా హైదరుజంగోజి

యలమబిడ్డల శిరస్సుజూచిరి టుపాకిలంతాను
పళపళయని కాల్చినారయ్యా టుపాకిలంతాను
ముగ్గురైన యల్మాదొరలు భూమిలోపడ్డారు
యలమలచావు కన్నులచూచెను ధర్మారాయుండు
యెన్నడులేని కోపముగలిగె ధర్మారాయుడికి
అన్నలార తమ్ములారా యల్మాదొరలూదా
మీదుబలములు యెక్కడపోయె యల్మాదొరలుదా
యీరీతిగ వ్యసనముతోడను ధర్మారాయుండు
చిక్కనతక్కిన రాణువలతోను యప్పుడెపలికెను
అన్నలారా తమ్ములారా యల్మాదొరలుదా
ముందువెనుక జూడవద్దు దండుకులోగాను
రాజువారి చెయ్యియిప్పుడు మొందున చూపిరి
మీదుబలములు చూపండయ్యా దండుకులోగానూ
పట్టాకత్తులు రెండుచేతుల బగ్గునపట్టెను
రామరామ అనంతకాలము రాజ్యమేలలేము
యెన్నిదినములు బ్రతికినగాని చావేదాయున్నది
యిచ్చట చచ్చినవారికి చాల [illegible]స్వర్గము
ధైర్యపుమాటలు చెప్పాడయ్యా ధర్మారాయుండు
దండులోగ దూకనారయ్యా యుద్ధముచేయను
ఈటెకొయ్యలు యెత్తినారయ్యా యల్మాబిడ్డలు
వేటువేటుకు నరికినారయ్యా ఏనుగులబారు
ఏనుగులతొండము బట్టియపుడు ధర్మారాయుండు
పట్టునిచింపి భూమిమీదనే బగ్గునవేసెను.
పట్టాకత్తి పదిమందైనా తాయిగ పడతారు
అప్పుడుతిన్న పప్పుకూడన్నము కుప్పగపడినాది
హరిరామ శ్రీరాముయంటు వస్తువున్నారు
వారివెంబడి వస్తున్నారు యల్మాదొరలుదా
చేతులుచేతులు పెనవేసి చేతులచంపిరి
కాళ్ళుగాళ్ళు పెనవేసి కాళ్ళతో జంపిరి

ఈరీతిగా వస్తున్నారు యల్మాందొరలు
అప్పుడెట్లా వున్నాడయ్యా ధర్మారాయుండు
ముందుగాను నరికినాడు మున్నూటికైన
వెనుకతూరి నరికినాడయ్యా యేనూటికైన
చలోచలోయంటు యప్పుడు వస్తువున్నాడు
బొబ్బిలివారి దేవిడివద్ద బాటలుకొట్టెను
అక్కడక్కడ పారాలన్ని వెనుకపోయింది
పారాలన్ని హతముచేసెను ధర్మారాయుండు
కొండలడవుల పాలాయెను ప్రాంచిదండుదా
చిల్లివంటి రక్తమూయాడ చిమ్మిపారింది
రాళ్ళురప్పల పాలాయెను రాజుల దండుదా
రక్తములోనె తుండెమొండెములు పైకితేలింది
గోడుగోడు చేసెనయ్యా దండుకు లోగాను
ముగ్గురైన యల్మాందొరలు చచ్చినచోటున
అయిదువేల యేనూటీదండు హతముచేసెను
కోటగవిని వస్తావున్నాడు ధర్మారాయుండు
కోటగవినికి వచ్చినయాపుడు గోవిందాబెట్టెను
యాబై మువ్వురు యల్మాందొరలను యెంచుకొన్నాడు
మువ్వురైన యల్మాందొరలు తగ్గబడినాది
తనలోను చింతించెను ధర్మారాయుండు
పోరుపెట్టుకొని కోటకు మనము యెట్లపొయ్యేది
బావగారు రంగయ్యతో యేమనిచెప్పేది
వారియొక్క తల్లిదండ్రులకు యేమని చెప్పేది
యీరీతిగ యోచించెను ధర్మారాయుండు
ఆజారమునకు వస్తున్నాడు ధర్మారాయుండు
వెనుకచిక్కి వస్తున్నాడు రంగయ్యదొరగారు
పరాకుంచక వినుము యిపుడు ధర్మారాయుడా
పోయినకార్య మేమాయెను ధర్మారాయుడా
కాయాయన పండాయన ధర్మారాయుడా

కాయగనిలచి యపుడె కలహము వచ్చెను
రాజుమాటలు ప్రాంచిమాటలు యొకటైయున్నాది
రాయబారము కుదరకపోతే వస్తువుటివి
పారామీద పోరుమాటలు గట్టిగ జరిగెను
ముగ్గురైన యల్లామ్మబిడ్డలు కోరుబెట్టినారు
యల్లామ్మబిడ్డలు పోరుబెట్టిన చోటును యపుడుదా
అయిదువేల యేనూటిదండు [illegible]గ చంపితిని
కోటలులో యుండె పోలేరమ్మకు జాత్రలు జేయిస్తి
ఈరీతిగా చెప్పినాడయ్య ధర్మారాయుడా
అట్టిమాటలకు యేమన్నాడు రంగయ్యదొరగారు
పాపారాయుడు సంధికిపోతే అక్కడన్నైతేను
కానికాని మాటలవలన కలహం వచ్చితేను
ప్రాంచివారి శిరస్సుకోసి కోటకు గట్టును
రాజుగారి శిరస్సుకోసి కోటలో గట్టును
కొలువునయుండ తగదు యిపుడు ధర్మారాయుడా
రాజులకాంతల మేడలకైన బొమ్మనిచెప్పెను
పదిమందిలో చిన్నబుచ్చెను వెంగళరాయుండు
అంతలోపల యేమన్నాడు ధర్మారాయుండు
బావగారి పుత్తురువు లేదు బావగారు దొరలు
బావగారి పుత్తురువునాకు కొంచముంటేను
డేరాలోగా చంపినవాని కొలువుకువస్తును
శెలవులు లేక బేటికివస్తిని వెంగళరాయుండా
మంచిదన్నాడు బాగన్నాడు ధర్మారాయుండు
అప్పచెల్లెలైన మల్లమ్మదేవి మేడకువచ్చేను
అప్పుడేలాగున్నదయ్యా మల్లమ్మదేవిదా
బారాపందెము బెట్టియుప్పుడు పగడలాడుతున్నది
అన్నదమ్ములన్ని కన్నులజూచెను మల్లమ్మదేవిదా
అప్పుడేమని చెప్పెనాదిర మల్లమ్మదేవిదా
పరాకు లేక వినుము యిపుడు ధర్మారాయుడా

యెప్పుడురాని అన్నగారు యెందుకువస్తిరి
మీరువచ్చిన కార్యమేమి తెలియజెప్పండి
యేమి అపాయం జెందెనయ్య బొబ్బిలికోటలో
అంగీరంతా రక్తమేమి ధర్మారాయుడా
ఈరీతిగా యడిగినాది మల్లమ్మదేవిదా
అప్పుడేమని చెప్పినాడయ్య ధర్మారాయుండు
పరాకుంచక వినవేతల్లి మల్లమదేవిదా
కర్మచండాలుడు కులద్రోహి విజయరామరాజు
కోటకిప్పుడు దండు తెచ్చెను విజయరామరాజు
భూములెరుగని ప్రాంచివారు భూములకొచ్చిరి
యధికదళములో వచ్చియపుడు కోటకమ్మినారు
యెటుప్రక్క చూచినగాని ఏడ సందులేదు
రాయభారముసకె పంపినారుగ రంగయ్యదొరగారు
రాయభారము పోతినమ్మా దండుకులోగాను
ప్రాంచివారి డేరావద్ద సంధికిపోతిని
రాయభారము కుదరకబోయె వస్తువుంటిని
పారామీద గట్టిమాట గట్టిగ జరిగెను
ముగ్గురైన యల్మాదొరల కోరుపెట్టినారు
ముగ్గురైన యల్మాదొరలు చచ్చినచోటులో
అయిదువేల యేనూటిదండు సాపుగ జంపిరి
బావగారి సముస్థానమునకు రాయిగవస్తిని
సంగతులన్నియు చెప్పితినమ్మ బావగారితోను
నిండుకొలువుస చిన్నబుచ్చెను రంగయ్యదొరగారు
వారకాంతల మేడకిప్పుడు పొమ్మని చెప్పెను
ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండు
యిన్నిమాటలు విన్నాదపుడ్మా మల్లమ్మదేవిదా
తమ్ముడికన్న ధైర్యపుమాటలు తానుచెప్పినాది
రక్తమైన అంగీలంతా తీసివేసినాది

స్నానమప్పుడు చేయించినాది మల్లమ్మదేవిదా
చలవవస్త్రము గట్టించెను ధర్మారాయుడికి
పెనిమిటిసభకు పంపెను మరల మల్లమ్మదేవిదా
అప్పుడెట్లా వున్నాడయ్యా రంగయ్యదొరగారు
నిండుకొలువులో వున్నాడయ్యా రంగయ్యదొరగారు
అన్నతమ్ములు బావమరుదులు కొలువుతీరిరి
ముందు జరిగిన కార్యమును యోచిస్తున్నాడు
యిక్కడియొక్క సంగతులు యిట్లున్నాది
అప్పుడెట్లా యున్నాడయ్యా మల్లమ్మదేవిదా
విజయరామరాజుగారికి వ్రాసెను జాబుదా
వందనమయ్యా వందనమయ్యా విజయరామరాజా
పూసలపాటి వారిల్లు పుట్టిల్లు యనుకొంటి
దామర్లవారి సమస్థానము మరచిపోయినాను
అన్నయనిదా నమ్మినాను విజయరామరాజు
విజయనగరము బొబ్బిలికోట కావడికుండలు
కావిడికుండలు తప్పించవద్దు కన్నతండ్రినీవు
నల్లగాజు నల్లపూస నాకునిల్పండి
బొమ్మకాటుక నిల్పుమయ్యా విజయరామరాజు
పసుపుకుంకుము నిల్పుమయ్యా విజయరామరాజా
ఈతూరి మన్నించుమయ్యా బొబ్బిలికోటాలు
ఈతూరి జాబువ్రాసి మల్లమ్మదేవియు
మున్నాటిలో పెద్దది వెంకటలక్షుమమ్మ
వెంకటలక్ష్మమ్మని యపుడు పిలచెను మల్లమ్మదేవియు
పరుగెత్తిదా వచ్చెనమ్మ వెంకటలక్ష్మమ్మయు
వందనమమ్మ వందనమమ్మ మల్లమ్మదేవిదా
నన్నుపిలచిన కార్యమేమి మల్లమ్మదేవిదా
అప్పుడేమని చెప్పినాది మల్లమ్మదేవిదా
నాకుచేరక నీవవెళ్లి వెంకటలక్షుమమ్మ
తొల్లిపగలు మనపై యుంచెను విజయరామరాజు

దేశమెరుగని ప్రాంచివారిని తెచ్చె యిచ్చుటను
యిరువైనాలుగువేల దళముతో ప్రాంచివచ్చినాడు
యధికదళములు వచ్చియపుడు కోటకమ్మినారు
గొల్లపల్లె కోనేటిలో రాజు డేరాదా
జాములెత్తుకొని రాజుముందు తాయిగ పొన్నండి
రాజుకొలువున జాబును బెట్టె వందన మొసగించు
యీరీతిగా చెప్పినాది మల్లమ్మదేవియు
జాబుకమ్మను వ్రాయించియిచ్చెను మల్లమ్మదేవియు
చాపకిన్ను దరబాజాగుండ నడవసాగిరి
రాజుగారి దండులోపల వస్తున్నాది
రాజుగారి కొలువునవుంచి వందన మొసగెను
యెవ్వరితాలూకా యన్నాడయ్యా విజయరామరాజు
మల్లమ్మదేవి తాలూకాయని దానులుచెప్పిరి
మల్లమ్మదేవి జాబునేను తెచ్చినానయ్యా
తెచ్చినజాబు కొలువ్వునబెట్టిరి వెంకటలక్షుమమ్మ
జాబునుయపుడె జేతనెత్తెను విజయరామరాజు
జాబులోని సంగతులన్నియు కన్నులజూచెను
పరాకుంచక వినుము యిపుడు విజయరామరాజు
అన్నయనిదా నమ్మినాను విజయరామరాజు
పూసలపాటి వారియిల్లు పుట్టిల్లు యనుకొంటి
దామర్లవారి సమస్థానమే మరచిపొయ్యినాను
విజయనగరము గావడికుండలు మరచిపోయినాను
గావడికుండలు తప్పించవద్దు కన్నతండ్రినివె
ఈతూరి మన్నించుమయ్యా బొబ్బిలికోటాను
మంచిమంచి చీరెలునేను మావదినెకంపుతాను
నల్లపూస నల్లగాజు నాకునిల్పండి
బొట్టుకాటుక నిల్పుమయ్యా విజయరామరాజు
పసుపుకుంకుము నిలుపుమయ్యా విజయరామ రాజు
ఈతూరి మన్నించుమయ్యా బొబ్బిలికోటాను

ఈరీతిగ వ్రాసియున్నది జాబుకులోగాను
అప్పుడే మని చెప్పినాడయ్యా విజయరామరాజు
పరాకుంచక వినవేతల్లి మల్లమ్మదేవిదా
నల్లపూసలు నల్లగాజులు నిల్పను తరమౌన
బొట్టుకాటుక నిల్పను నాతరముగాదుతల్లి
ముండమోసితే మూడుపల్లెలే యినాము యిస్తానూ
ముండకోక ముందుగ వేతు మల్లమ్మదేవిదా
ముందుకూర ముందుయన్నము నీదేయున్నదు
విజయనగరమునుండి నేనుజాబును వ్రాస్తిని
జాబుతెచ్చిన హర్కారీలను చంపలుకొట్టించి
మెడనుబట్టి త్రోయించెను వెంగళరాయుండు
ఆడనారి జాబులు యెపుడు కొలువుకు రారాదు
చదివినట్టి జాబులక్కడ చింపివేసినాడు
జాబుతెచ్చిన వెంకటలక్ష్మిని చెంపలుగొట్టెను
మెడబట్టి త్రోచెనయ్యా విజయరామరాజు
ఘోడుఘోడున దుఃఖించినాది వెంకటలక్షుమమ్మ
మల్లమ్మదేవీ కొలువుకు వచ్చెను వెంకటలక్షుమమ్మ
గోడుగోడున దుఃఖించెను వెంకటలక్షుమమ్మ
యింతలోపల యేమన్నాది మల్లమ్మదేవియు
పోయినట్టి పనియేమాయెను వెంకటలక్షుమమ్మ
మీరు యిచ్చిన జాబులక్కడ కొలువున బెట్టితిని
జాబును యెప్పుడె చదువుకొన్నారు విజయరామరాజు
ముండమోసితే మూడుపల్లెలు యినాములిస్తాడు
నిన్ను అధిక మాటలవల్ల తిట్టినాడు తల్లి
చదివినట్టి జాబులక్కడ చింపివేసినాడు
చింపినట్టి జాబులును నిప్పుపెట్టెను
చంపలైన కొట్టినాడు మల్లమ్మదేవిదా
మెడనుబట్టి దోచెనమ్మ మల్లమ్మదేవిదా
యీరీతిగా చెప్పినాది వెంకటలక్షుమమ్మ

యిక్కడి కథలు యీలాగు వున్నది కోటను లోగాను
అప్పుడెట్లా వున్నాడయ్యా వెంగళరాయుండు
అన్నగారు రంగయ్యదొర యెరుక లేకుండాను
వదినెగారు మల్లమ్మదేవి యెరుక లేకుండాను
బావమరిది యప్పుడె జాబులు వ్రాస్తాడు
కాకితంబును పేనాయపుడు చేత నెత్తేరు
రాజాధిరాజపూజిత పాపారాయుడా
కటాక్షము యలాయుంచుము పాపారాయుడా
కోటమీదనే దండు తెచ్చెను విజయరామరాజు
యధికదళంబులు వచ్చియప్పుడు కోటకమ్మినారు
మంచినీళ్ళబావివద్ద లక్షుమయ్యడేరాను
పాతబొబ్బిలి పాటిమీదనే వ్రాంచిడేరాదా
గొల్లపల్లి కోనేటిలో రాజుడేరాలో
యీరీతిగా యున్నారయ్యా కోటలుచుట్టును
రాజునుగొట్టి రేవులవద్ద మీరేరిన్నండి
వ్రాందిసిగొట్టి రేవులవద్ద మీరేరన్నండి
యీరీతిగా వ్రాసెను జాబును యప్పుడుదా
లకోట చేసినాడు జాబుకులోగాను
యిద్దరైన బేగిరావుల తావున బిలచినాడు
స్త్రీలవేషము వేసినాడయ్యా బేగిరావులకు
కురులు సన్నగ దువ్వించెను కొప్పుబెట్టినాడు
చీలరవికెలు గుట్టించెను బేగిరావులకు
గాజులపుడు తొడగినారు బేగిరావులకు
గంపనిండ తోటకూర కోసివేసినాడు
గోధుమపిండి పాకము చేయించి
రొట్టెయపుడు కాల్చినాడు వెంగళరాయుండు
రొట్టెలోనే పెట్టినాడుజాబును యపుడుదా
తోటగూర నడుమరొట్టెలు బెట్టిరి
అప్పుడేమని చెప్పినాడు వెంగళరాయుండు

డేరాడేరాడేరావద్ద కూరలుతీమ్మండి
వెలలుఅధికం చెప్పిమీరు కూరలుఅమ్మండి
పారాలోపల బడిపోన్నండి బేగిరావులు
రాజారములో వున్నాడయ్యా పాపారాయుడు
రాజువారు వస్తారని బాటగాచివున్నాడు
రాజారములో టాణావున్నాడు పాపారాయుడు
పాపారాయుడు వద్దను యిపుడు మీరేపోన్నండి
రొట్టెలయందు జాబుకమ్మను కొలువునవుంచండి
యిచ్చట నడచిన సంగతులన్ని రాయగచెప్పండి
యీరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుడు
చావకన్ను దరిబాజాగుండా యప్పుడెబోయిరి
యచ్చటనుండి వస్తున్నారు బేగిరావులు
డేరాడేరాడేరావద్దకు కూరలుయమ్మకొని
కూరకూరకూరయంటు కూతలుబెట్టిరి
వెలపొడుగు ధరలు జెప్పుతూ కూరలమ్మినారూ
ప్రాంచీవారి దండుకులోగా కూరలమ్మినారూ
కొండప్రక్క వచ్చినారు బేగిరావులు
కొండప్రక్క రాజుగ తిరుగుతుయున్నాది
కత్తులపారా కలాసువారా తిరుగుతుయున్నారు
దొంగజేరు పారాలన్ని తిరుగుతుయున్నారు
పారావద్ద డాకిలైరి బేగిరావులు
యప్పుడేమన్నారయ్యా పారాంచౌకీలు
యేవూరు యేపల్లెవారు తెలియచెప్పండి
కొండప్రక్క గొల్లపల్లెలో మేముయుండేది
గంపలో యేమే గంపలో యేమే మమ్మగన్నతల్లి
పరాకుంచక వినుమా యిపుడు పారాచౌకీలు
తోటకూర యమ్ముతు మేమువస్తువున్నాము
కొంతకూర పెట్టుము మముగన్నతల్లి
యిట్లుచెప్పుతు గంపయపుడు దిగువదించినారు

క్రిందుమీదుగ చూపినారయ్యా తోటకూరను
అప్పుడేమని చెప్పినారయ్యా పారాచౌకీలు
రొట్టెలెందుకే మమ్ముగన్నతల్లి
ఆకలిగొంటె రొట్టెలుతిని దాహాము చేతుము
యీరీతిగా చెప్పినారయ్యా బేగిరావులు
అట్టిమాటలకు యేసున్నారు పారాచౌకీలు
మాయొక్క ఆడవారు రొట్టెకాలిస్తె
యెంతదా సుఖముగా యున్నదె మముగన్నతల్లి
యిట్లుచెప్పుతు రొట్టెలువాడు నడుమునతుంచిరి
రొట్టెలోయుండు మర్మపుజాబు బయటపడినాది
రొమ్ముగొమ్ము గుద్దుకొన్నారు పారాచౌకీలు
యిద్దరును బట్టుకొని కైదులోవుంచిరి
రాజుగారి డేరావద్ద తీసుకవచ్చిరి
ఖైదులోను తీసుకవచ్చిరి బేగిరావుల
రాజుగారి కొలువునవచ్చి వందనమొసగిరి
పరాకుంచక వినుము యిపుడు విజయరామరాజు
బొబ్బిలివారి ముచ్చిలిజాబు మేము తెచ్చినాము
జాబులుయిపుడు చేతికిచ్చాను పారాచౌకీలు
కోటలకెల్ల కోరసింహాము కోటలోలేదండి
రెండులక్షల వరహాలపుడు సదరుమెత్తుకొని
ప్రాంచివారి డేరావద్దకు పాదరివచ్చెను
సలామయ్యా సలామయ్యా ప్రాంచిదొరగారు
యీలాగు జెప్పినాడయ్యా విజయరామరాజు
యిద్దరుయొక్క కుర్చీమీద కొలువుతీరినారు
అప్పుడేమని చెప్పినాడయ్యా విజయరామరాజు
బొబ్బిలివారి దొంగజాబులె బైటపడినాది
తెచ్చినట్టి దొంగజాబులె చేతికిచ్చెను
జాబును చేతదీసుకొన్నాడు ప్రాంచిదొరగారు
జాబులోయుండు సంగతులన్ని కన్నులజూచెను

అప్పుడేమని చెప్పినాడయ్యా ప్రాంచిదొరగారు
పాప రాయుడు యెవడన్నాడు ప్రాంచిదొరగారు
చిన్నమనవి చిత్తగించుమి ప్రాంచిదొరగారు
బొబ్బిలి యందుండువారికి పేరు జెప్పుతాను
రంగారాయుడు వెంగళరాయుడు
రంగారాయుడు బావమరది ధర్మారాయుండు
వెంగళరాయుండు బావమరిది పాపారాయుండు
పేరుయెత్తిన సరదారిబిడ్డ పాపారాయుండు
పులిలేదయ్యా పులిలేదయ్యా బొబ్బిలికోటలో
పాపారాయుండు యుద్ధరంగుడు పటాలరాముడు
పటాలరాముడు మొనగాడండి ముత్యాలపాపయ్య
నూటికియొకడె సరదారి యున్నారు కోటకులోగాను
కోటలకంతియు కోరుసింహము పాపారాయుడు
ఇది సమయము యిదెవేళర బొబ్బిలిమీదికి
ఈరీతిగ చెప్పినాడయ్యా విజయరామరాజు
అట్టిమాటలకు యేమన్నాడు ప్రాంచిదొరగారు
యెవ్వరికి మొనగాడండి పాపారాయుండు
పాపారాయుడని నీవు ప్రసిద్ధి జెప్పేవు
ఈరీతిగా చెప్పినాడయ్యా ప్రాంచిదొరగారు
అట్టిమాటలకు యేమన్నాడు విజయరామరాజు
అట్లు చెప్పవద్దు అట్లు చెప్పవద్దు ప్రాంచిదొరగారు
పాపారాయుడని వానిపేరు చెప్పితేను
పసిబిడ్డలైన పాలుత్రాగ లేరు
బొబ్బిలికోటకు వస్తుడయ్యా పాపారాయుండు
తాండ్రవారి పాపరాయుడు కోటలోయుంటేను
యింతసేపు నిల్వనిచ్చునా కోటలక్రిందాను
నల్లయేరు దాటనివ్వడు పాపారాయుండు
యికయేమి చెప్పుదు ప్రాంచిదొరగారు
యెటువంటి దొంగజాబులు యెన్నిపోయినవో

యిక్కడియొక్క సంగతులు తెలిసే యుంటేను
రాత్రిరాత్రి వచ్చునయ్యా పాపారాయుండు
పడకలోను గుమ్మినాడు కోటకుపోతాడు
నమ్మరాదు నమ్మరాను బొబ్బిలిదొరగారు
కాలహరణము చేయరాదు ప్రాంచిదొరగారు
మూడవ జామున తియ్యవలెను బొబ్బిలికోటాను
రాత్రిపూటనే బొబ్బిలికోటను పట్టండి
తెల్లవారిగా దేవిడిముందు ప్రాంచిదొరగారు
పన్నెండులక్షుల పైకమైతే గొబ్బున యిస్తాను
యెదురుగా నిల్వబెట్టెను విజయరామరాజు
భీరంగితో కాల్పించెను విజయరామరాజు
తలుపు తెరచిన చందమామను బొబ్బిలికోటాదా
యీరీతిగా చెప్పినాడయ్యా విజయరామరాజు
దొంగజాబు తెచ్చినట్టి బేగిరావులను
దొంగజాబులను తెచ్చినవారిని యేమిచేసినారూ
తొలిదెబ్బకు తునిగిబడ్డారు బేగిరావులు
రాజుమాటలే విన్నాడయ్యా ప్రాంచిదొరగారు
యీసంగతులే తెలియకపోయె వెంగళరాయుడికి
బొబ్బిలివారి బలములంతా తెలియక యున్నారు
కానకవక్క పరమాన్నై రాజుకుయిచ్చెను
అప్పుడెట్లా వున్నాడయ్యా ప్రాంచిదొరగారు
బొబ్బిలివారి మన్నెంమీదికి కదలివచ్చినారు
ఇన్నాటం అవుతడుపులే కొల్లబెట్టినారు
మున్నాట పందిపిల్లల కొల్లబెట్టినారు
ఆవులగొంతు గోసినాడు ప్రాంచిదొరగారు
పందులగొంతు గోసినాడు ప్రాంచిదొరగారు
పచ్చిరక్తం భరంతసారాయి పాకంచేయించి
దండుకు మొన సుబేదారుని పిలిపించినాడు
దండుకు మొన సుబేదారుని హాయిదరు జంగోజి

హైదరుజంగోజి కొలువుకువచ్చి సలాముచేసెను
మనిషి.యొక్క మూడుగిన్నెలు లాగిరి యిచ్చెను
లాగిరితాగిన మాకు నిమిషములకు కైపుయెక్కెను
కోటమీదుగ నడచినారయ్యా జాతులవారుదా
మందుపెట్టెలు పగలగొట్టి మందులు పరచిరి
మందుబెట్టెచు తిత్తుకుండలు బండ్లవేసిరి
పెద్దఫిరంగిగుండ్లంతయు బండ్లవేసిరి
యీరీతిగా ప్రయాణమైనావి ఈనిమిషంబులోన
యచటనుండి వస్తున్నారు జాతులవారుదా
కోటకుదిగువ వచ్చినారు జాతులవారుదా
మద్దిమానులు కొట్టించినారు జాతులవారుదా
అడ్డత్రోవదా నడిచినాడు భీరంగిగుండ్లుదా
తట్టుకోట క్రిందకువచ్చి మకాముచేసిరి
పెద్దభీరంగి బండ్లంతయు మోహర్జాలెత్తిరి
రామలక్ష్మణ భీరంగికి మోహర్జాలెత్తిరి
పదికత్తులకె శెలవిచ్చినారు జల్లకొట్టినారు
పళపళయని కాల్చినారు భీరంగిలంతయు
తొలిదెబ్బకు కోటబద్దలాయెను
గడ్డగడ్డగా పడిందయ్యా భూమికి పైగాను
తట్టుకోటలో యున్నాడయ్యా పటాలరాముడు
యెక్కవచ్చె ప్రాంచివారిని కన్నులజూచెను
యీభైముగ్గురు యల్మాందొరలు వెంటనేయున్నారు
అన్నలార తమ్ములార మాయన్నలార రండు
రంగయ్యతో చెప్పబోతే కాలమవుతుంది
చచ్చినాను బ్రతికినాను పేరేయుంటుంది
ముందు వెనుక చూడవద్దు దండుకులోగాను
బారాతేజి యెక్కెయపుడు పటాలరాముండు
కన్నుసైగచేసినాడయ్యా పటాలరాముడు
ఝూటెమీద సాముచేసిరి యల్మాందొరలుదా

యెక్కి వచ్చె ఫ్రాంచివారిని సాపుగ చంపిరి
కోటవెలుపలదుమికినాడు పటాలరాముడు
డేగలాగు దూరినాడు పటాలరాముడు
వంచివంచి యీటెలతోను వాదులు యాడిరి
చేతులతోను బట్టియపుడు బాకున గుమ్మిరి
మెడనువంచి వీపుమీద బాకున గుమ్మిరి
వత్తులబెట్టి జాతులవారిని గొంతులు గోసిరి
కాళ్ళుత్రొక్కి గొంతులు గోసిరి ఫ్రాంచివారిని
గుర్రముచుట్టు గుంపులుగానే పోరు చేసినారు
అక్కడక్కడ పారాలన్ని వెనుక బోయినారు
దండుకు మొన సుబేదారుగ హాయిదరు జంగోజి
జయించజాలక ఫ్రాంచివారి ముందుగ వచ్చెను
సలామయ్యా సలామయ్యా ఫ్రాంచి దొరగారు
అప్పుడేమని చెప్పినాడయ్యా ఫ్రాంచి దొరగారు
యిప్పుడు జరిగె యుద్ధరంగము యెవ్వరిదన్నాడు
పటాలరాముడు యుద్ధమిపుడు జరుగుతు యున్నాది
పటాలరాముని మనమే యిపుడు జయించలేమండి
మూడుపుట్ల సల్లమందుకే శెలవలు యివ్వండి
భూమిమీద పరచినాడు జాతులవారుదా
రవ్వగుండ్లు పరచినాడు మందులోగాను
నాలుగుప్రక్కల మందుత్రాళ్ళు తగిలించినారు
నిప్పులుబెట్టి జాతులవారు వెంటనే యున్నారు
మున్నూట కవాతుగుర్రము ముందుగ యున్నాది
రామరామ రామరామ రామయుంటు వస్తున్నారు
గుర్రమునగా దూకినారయ్యా యల్లాందొరలూదా
నాలుగుప్రక్కల త్రిప్పినారు కవాతుగుర్రమును
తెలియకవచ్చి సల్లమందులో పడికూలిరి
నాలుగు ప్రక్కల నిప్పుత్రాళ్ళు తగిలించినారు
ముందు వెలుపట దూకినాడు పటాలరాయుడు

# పెద్ద బొబ్బిలి రాజు కథ

మలమలయని మాడినారు యల్మ్మాబిడ్డలు
పటాలరాముని బారా తేజి సుందనకూలింది
యొక్క దై నిలిచినాడు పటాల రాముండు
నిప్పులుబెట్టు జాతులవాసి గొంతులుగోసెను
కాళ్ళత్రొక్కి గొంతులుగోసె ప్రాంచివారిని
వేటువేటున నరికినాడు మేచుగులగుంపును
హోళ్యాహోళ్యాలుగ తరిమి నరికినాడు దళములుతాను
పక్క బాజిలో యున్నారండి హైదరుజంగోజి
కనుసైగ చేసినాడు పారావారలకు
యాబై రెండు తుపాకులాడా టుప్పునకాల్చిరి
చుక్కలాగు టుపాకిదెబ్బ నొష్టతగిలింది
రొమ్ముతగిలిన గాయాలన్ని మెంతతరమాన
డొక్కలోన తగిలిన గుండులు వీపున పోయింది
రక్తవెల్లువలు పారుతుంది గాయలగుండాను
పేగులకండలు జీరాడెను పటాలరాముడికి
వ్రేలాడు ప్రేగులబట్టి దట్టిలోకట్టిరి
మల్లెమొగ్గలవంటి బల్యముతాను తీసుకోని •
తరిమితరిమి పొడిచినాడు తొంబైమందిని
నిలవజాలక పోయెనప్పుడు పటాలరాముండు
యింత బ్రతుకు బ్రతికితేను వీరిచేతిలో
వీరిచేతిలో చావడానికి జాతకమున్నదా
యీరీతిగా యోచించెను పటాలరాముండు
మండ్యముంచి కొలువుతీరెను పటాలరాముండు
నడుమునయున్న పచ్చలబాకు జుర్రునదూసెను
బాకుతీసి రొమ్మునవేసి భూమినపడినాడు
కుట్టుకుట్టు ప్రాణముతోను వాడెయున్నాడు
పటాలరాముడు చచ్చినాడని డంకాకొట్టిరి
వెనుకబోయిన దండుయిపుడు తిరుగావచ్చెను
ప్రాణముతోను పటాల రాముని శిరస్సుగోసినా..

తట్టుకోటలో జండాకొయ్య యెత్తించినారు
పుట్టుకోట క్రిందవచ్చి మకాముచేసిరి
యాభైరెండు రేఖాలుగా మొహర్జాలెత్తిరి
గుండుమందు వేసియపుడు గెట్టనచేసిరి
పళపళమని కాల్చినారు టుపాకిలంతాను
లక్కతోను గట్టియున్నది పుట్టుకోటయును
ధాంధాంమని భీరంగులు వారెకాల్చిరి
గుండుదెబ్బకు బెత్తుడుకమ్మి సాగుతువున్నాది
సాద్యానికి రాకయున్నది పుట్టుకోటయున్న
శీమపుడుములు తెప్పించినారు ప్రాంచివారుదా
కోటలపైగా తగిలించినారు జాతులవారుదా
వుడుముతోక పట్టుకొని లగ్గలకెక్కిరి
యెక్కవచ్చి దండుయపుడు కన్నులచూచెను
పుట్టకోటలో వున్నాదయ్య భేరిరామక్క
మున్నారు బేరిస్త్రీలు కోటలోయున్నారు
అందరికన్నా పెద్దదాదీ బేరీరామక్క
అలంగాలకే యెక్కింది బేరిరామక్కా
కోటలక్రింద జూచినాది బేరిరామక్కా
అక్కడనుంచి వచ్చినాది బేరిరామక్కా
రాజదివాణం వచ్చినాది బేరిరామక్కా
స్త్రీలనందరని బిలచినాది బేరిరామక్కా
యమ్మలార చెల్లెలార అమ్మలార రండు
పుట్టకోట కమ్మినారు ప్రాంచిదొరగారు
రామరామ యనంతకాలము రాజ్యమేలలేము
జగముయుండువరకు మనము వుండబోతామా
ధైర్యపుమాటలు పలికినాది బేరిరామక్కా
యెన్నాళ్ళు బ్రతికినగాని చావే స్థిరమాను
వారివారి దివాణమునకే కదలివచ్చినారు
వారివారి పురుషులంతా బేదము జేయబోయినారు

వాడబేరము జేయను వారే బోయిరి
తక్కెడగుండ్లు పలాలుగుండ్లు పీపునగట్టిరి
మనిషి మనిషికి వక్కలాకులు చేతనుబట్టిరి
ముసలివారిని బట్టియపుడు గొంతులుగోసిరి
యడాయడా బాలలుబట్టి గొంతులుకోసిరి
పాలుత్రాగే బిడ్డలునంతా పీపునగట్టిరి
అలంకారము యెక్కినారు భేరిస్త్రీలుదా
యెక్కివచ్చె ప్రాంచిదండును కన్నులచూచిరి
వడకాళ్ళలో రాళ్ళు చెక్కిరి భేరిస్త్రీలంతా
వడిగాయపుడు రువ్వినారు రాళ్ళు అయితేను
వడిశాలక్రింద మూడువేల మరణము చెందిరి
రవిడిగుండ్లు దొరలించినారు భేరి స్త్రీలుదా
యెద్దులకపుడు కాగుతున్నది అంబడబాణాలు
పల్లు వేసి బట్టినారు అంబడిబాణాలు
బానలనంతము దొర్లించినారు రాణువును పైగాను
బానలక్రింద రెండువేలకు మరణము జెందిరి
నాసినమానును తీసినారు భేరి స్త్రీలుదా
గిరగిరమని త్రిప్పినారు నాసులమానును
దండుమీదికే నాసమానులు తాయిగ విసిరిరి
మానులక్రింద మూడువేల మరణముజెందిరి
బురుజులక్రింద జేరనివ్వను భేరిస్త్రీలుదా
సింహములాగు విడబడినారు భేరస్త్రీలుదా
యేనుగులయొక్క తొండము బట్టి వెనుకపెట్టినారు
అక్కడక్కడ పారాలన్ని వెనుకనే వెళ్లింది
పటాలు గేలు సాము జేసిరి భేరి స్త్రీలుదా
చక్రములాగు తిరిగినారయ్యా భేరిస్త్రీలుదా
వేటువేటున నరికినారు యేనుగుల గుంపునుదా
కోటక్రిందుగ పారాలన్ని సాపుగజంపిరి
అప్పుడెట్లా వున్నాడయ్యా హాయిదరు జంగోజి

ఫ్రాంచివారి బేటికివచ్చి సలాము జేసెను
యిప్పుడు జరిగేయుద్ధము యెవ్వరిదన్నాడు ఫ్రాంచిదొరగారు
బేరిస్త్రీల యుద్ధమిప్పుడు జరుగుతు యున్నది
బురుజులక్రింద జేరనివ్వరు బేరిస్త్రీలుదా
గెలువలేము గెలువలేము బేరిస్త్రీలుదా
మూడుపుట్ల నల్లమందుకే యుత్తరమియ్యేము
ఈమాటలు విన్నాడయ్యా ఫ్రాంచిదొరగారు
టోపీతీసి దిగువగొట్టె ఫ్రాంచిదొరగారు
చేతివేలు కొరికేనయ్యా ఫ్రాంచిదొరగారు
మూడునిమిషములు మూడేగుర్రాలు
ఆరునిమిషంబులకు తీసినారు ఆరణిబళ్లారి
యింతయుద్ధము నేను యిక్కడ జూడనేలేదయ్యా
పల్లెబొబ్బిలి మీరు తెచ్చి పాపిష్టిరాజు
పల్లెబొబ్బిలి కాదురయ్యా పట్నం బొబ్బిలిరా
యీరీతిగా చెప్పినాడు ఫ్రాంచిదొరగారు
మూడుపుట్ల నల్లమందుకే వుత్తరవు యిచ్చేను
యుత్తరువు తెచ్చినాడయ్యా హాయిదరు జంగోజి
మూడుపుట్ల నల్లమందు భూమిన పరచెను
రవ్వచాల పరచెను మందురు లోగాను
యిచ్చుకత్తులే సానకత్తులు మందున వేసిరి
నాలుగుప్రక్కల మందుత్రాళ్ళు తగిలించినారు
నిప్పుబెట్టె జాగులవారు వొంబడియున్నారు
మున్నాటి కవాతుగుఱ్ఱము ముందుగ నిలచెను
శ్రీరామ యంటువారు వస్తువున్నారు
గుఱ్ఱమని దూకినారు బేరి స్త్రీలుదా
గుద్దుగుద్దుకె చంపినారు గుఱ్ఱములంతాను
పట్టాదెబ్బకు పదిమంది తాయిగ చచ్చిరి
కత్తులుతిప్పి పోయిన దూరము పీనుగులు పడ్డాది
యింతవరకు గాయములేదు బేరి స్త్రీలకు

నాలుగుప్రక్కల త్రిప్పినారు కవాతుగుఱ్ఱము
తెలియకవచ్చి నల్లమందులో గొబ్బున దూకిరి
నాలుగుప్రక్కల నిప్పులైన పెట్టినారపుడుదా
భగ్గుభగ్గున రగిలి యాపుడు మంటలు లేచెను
మలమలయని మాడినారు బేరిస్త్రీలుదా
యీరీతిగా చచ్చినారు బేరిస్త్రీలుదా
ఆలంగాలకే యెక్కినారు ఫ్రాంచి దొరలూదా
అచ్చటయుండు వెండిబంగారు బండ్లకె యెత్తించి
బంగారువెండి దేరావద్దకు పంపించినాడు
పుట్టకోట పరిశుద్ధపరచిరి ఆనిమిషంబులోన
పుట్టకోటలో జండాకొయ్య యెత్తించినారూ
పుట్టకోట పట్టుకున్నాడు ఫ్రాంచిదొరగారూ
రాజుగారి తెల్లజండా యెత్తించినారూ
మూలబురుజు క్రిందవచ్చి మకాము చేసిరి
రామలక్ష్మణపిరంగిలాడ మోహార్జాలెత్తిరి
అరవైమూడు లేఖలాలుగా మోహార్జాలెత్తిరి
పళపళయని కాల్చినారు భీరంగి యపుడుదా
తొలుతదెబ్బ మూలబురుజు బద్దలాయెను
గడ్డగడ్డగా విరిగి భూమిన పడినాది
ఆలంగాలకు యెక్కినాది ఫ్రాంచి దండుదా
మూలబురుజున వున్నాడయ్యా ముత్యాలపాపయ్య
యాభైమగ్గురు యల్మాందొరలు చవుకిపున్నారు
అప్పుడేమని చెప్పినాడయ్యా ముత్యాలపాపయ్య
అన్నలారా తమ్ములారా అన్నలారా రండు
మించివచ్చెను మించివచ్చెను యుద్ధమిపుడు దా
రంగయ్యతో జెప్పుసుబోతే బాగుయాతుంది
జగముయుండు కాలమువరకు వుండబోతామా
యిచ్చట చచ్చినవారికి వీరస్వర్గము
ధైర్యపు మాటలు చెప్పినాడు ముత్యాలపాపయ్య

ముందువెనుక చూడవద్దు దండుకు లోగాను
మీదుబలములు జూపుమయ్యా దండుకు లోగాను
ఈరీతిగా చెప్పినాడు ముత్యాలపాపయ్య
బారాతేజిమీదనె యపుడు కొలువుతీరినాడు
చవుకుతో తట్టినాడు బారాతేజిని
వారివెంబడి వస్తున్నారు యల్మాబిడ్డలు
దండుమీదనే కలపటమైరి యల్మాబిడ్డలు
పోటుయీటెలు వేసుకొనిదా టాయిగ దూకిరి
యెక్కివచ్చే ఫ్రాంచిదండును కనులచూచిరి
పళపళయని యుద్ధము చేసిరి
వంచినట్టి యీటెలతోను వాదులుచేసిరి
కోటవెలువడి దుమికినారు యల్మాబిడ్డలు
వానివెంబడి దుమికినారు యల్మాబిడ్డలు
మెడనుబట్టి వీపుమీద బాకున బొడిచిరి
మోకాలులోతు రక్తముయీడ మొగసిపారెను
తిన్నవంటి పప్పయన్నము ముద్దగ బడినాది
పోయినంత దూరము పీనుగలు పడింది
దండుకు సూటిమనుష్యులకు నరుకుతు వస్తారు
అప్పుడేమని చెప్పినాడయ్యా హాయిదరు జంగోజి
ఫ్రాంచివారి బేటికివచ్చె. హాయిదరు జంగోజి
సలామనగా టోపితీసెను ఫ్రాంచిదొరగారు
యెప్పుడు జరుగు యుద్ధము యెవ్వరిదన్నాడు
ముత్యాలపాపయ్య యుద్ధము జరుగుతుయున్నాది
జెయించలేము జెయించలేము ఫ్రాంచి దొరగారు
రెండుపుట్ల నల్లమందుకు వుత్తరువు లియ్యండి
రెండుపుట్ల నల్లమందు భూమిన పరచెను
రవ్వలు నిండుగలిపినారు మందుకు లోగాను
నాలుగుప్రక్కల నిప్పులుత్రాళ్ళు తగిలించినారు
భగ్గుభగ్గున మంటలు యప్పుడు దగ్గున రగిలెను

మందుకుముందు దుమికినాడు ముత్యాలపాపయ్య
వెంబడివచ్చిన యల్లాంబిడ్డలు మందున కూలిరి
తొంటిగా నిలిచినాడయ్యా ముత్యాలపాపయ్య
నిప్పులుబెట్టి జాలవారి గొంతులుకోసెను
వేటువేటున నరికినాడు యేనుగులంతాను
యేనుగతొండము బట్టియపుడు నేలను గొట్టెను
యీరీతిగా యున్నాడయ్యా ముత్యాలపాపయ్య
ప్రక్కలో నిలిచియుండు టుపాకిబారుదా
యాబైరెండు టుపాకులాడ టుప్పున కాల్చిరి
గప్పుగప్పున కాల్చినారు టుపాకిలపుడుదా
పక్కనితగిలిన గాయాలన్ని యెంచతరముగాదు
వీపునతగిలిన గాయాలనియెంచతరముగాదు
చుక్కలాగు టుపాకిదెబ్బ నెత్తినతగిలెను
కడుపులోని పేగులు జీరాడెను ముత్యాలపాపయ్య
జీరాడె పేగులుయెత్తి దట్టిలో బంధించెను
కూనుగలిగిన బల్లెంబును చేతనుబట్టెను
తరిమితరిమి పొడిచినాడు తొంబైమందిని
నిల్వజాలక పొయ్యెనయ్యా పాపయ్యదొరలుదా
వీరిచేతిలో చావడమునకు బ్రహ్మవ్రాసెను
ఈరీతిగా యోచించెను ముత్యాల పాపయ్య
బాకుతీసి రొమ్మున పొడిచి భూమినపడ్డాడు
భూమిమీద పడగానే ప్రాణము విడిచెను
ముత్యాలపాపయ్య చచ్చాడని డంకాగొట్టి
మూలబురుజు పట్టుకొన్నారు ప్రాంచిదొరగారు
రాజుగారి తెల్లజెండా యెత్తినారు యపుడు
ప్రాంచివారి నిశానికొయ్య యెత్తినారు యప్పుడు
నాలుగుకోటలు పట్టుతున్నారు ప్రాంచిదొరగారు
నాలుగుకోటలు కొల్లబోయెను బొబ్బిలిలోగాను
బొబ్బిలికోట దిగువవచ్చి మకాము చేసిరి

రామలక్ష్మణ భీరంగిలాడ మొహర్జాలెత్తిరి
డాక్షరంబులు త్రొక్కించినాడు డాబాలు పెట్టించి
అరివైమూడు శేఖలుగా మొహర్జాలెత్తిరి
పళపళయని కాల్చినారు భీరంగిలంతాయు
దివాణమందు భీరంగిగుండు దూసుకుతున్నాది
అప్పుడెట్లా వున్నాడయ్యా రంగయ్యాదొరగారు
వచ్చినట్టి భీరంగిగుండ్లు కన్నుల చూచెను
తటుక్కున లేచినాడయ్యా రంగయ్య దొరగారు
తమ్ముడియొక్క బేటికియప్పుడు వస్తుయున్నాడు
అప్పుడెట్లా వున్నాడయ్యా వెంగళరాయుండు
కోడిపందెము ఆడుతువారు కొలువున యున్నారు
తమ్ముడియొక్క బేటికివచ్చి రంగయ్యాదొరగారు
పరాకుంచక వినండిమీరు వెంగళరాయుడా
యింక యేలరా కోడిపందెము వెంగళరాయుడా
పట్టుకోట పుట్టుకోట కొళ్ళపోయినాది
మూలబురుజు పట్టుకొన్నారు ప్రాణివారుదా
బొబ్బిలికోటలో భీరంగిగుండు దూసుకుతు యున్నాది
యుద్ధమిపుడు వచ్చినయ్యా వెంగళరాయుడా
యీరీతిగా చెప్పినాడయ్యా రంగయ్య దొరగారు
యంతలో బీరంగిగుండులు దూసుకుతు యున్నది
వచ్చినట్టి భీరంగిగుండ్లు జవిరిపట్టినాడు
గుండుతోను గుద్దులాడెను వెంగళరాయుండు
అన్నకొలువున బెట్టినాడయ్యా వెంగళరాయుండు
తామస మేలనయ్యా వుత్తరువు లియ్యండి
యీరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుండు
అట్టిమాటలకు యేమన్నాడు రంగయ్యాదొరగారు
పరాకుంచక వినండిమీరు వెంగళరాయుండు
సరోయున్నది సితోయున్నది బొబ్బిలికోటదా
బొబ్బిలికోట కీర్తిపేరు మీరే తెస్సండి

మీదా బంగులంతా దంపులో చూపాండి
ముందూ వెనుక జూపవద్దు వెంగళరాయుడా
యీరీతిగా చెప్పినాడయ్యా రంగయ్యదొరగారు
అక్కడనుంచి శెలవులు తీసివస్తున్నాడు
దివాణము వద్ద వచ్చినాడు వెంగళరాయుండు
తన్ను కొలిచె రాణువలంత పిలపించినాడు
వందనమయ్యా వందనమయ్యా వెంగళరాయుడ
మమ్మూ పిలిపించినట్టి కార్యమేమి వెంగళరాయుడ
ఈరీతిగా యడిగినారు రాణువలంతాను
అప్పుడేమని చెప్పినాడయ్యా వెంగళరాయుండు
పరాకుంచక వినుము యిపుడు యల్మందొరలారా
యుద్ధమునకు రావలెనయ్యా యల్మందొరలు నా
నాతో కూడ రావలెనయ్యా యిప్పుడు మీరు నా
చావంటే భయపడకుము యల్మందొరలుగా
వారివారి దివాణమునకు లగువులు మెత్తిరి
దివ్యయన్న పరమాన్నము భోజనము చేసిరి
తాంబూలము చేతబట్టెను యల్మందొరలుదా
జాజిపువ్వుల జల్లడములు దిగ్గున తొడిగిరి
కాసిమీదనే సీరకాసులు నడుమునగట్టిరి
పట్టుకుచ్చుసొగసు యీటెలు బిరుసులు గట్టిరి
రామరామ రామయంటూచు తయారుబడినారు
వెంగళరాయుడు బేటికివచ్చి వందనమొసగిరి
తామసమేల యిపుడు మీరు తయారుకానిండి
కొట్టడిల్లు తెరచినాడు వెంగళరాయుండు
పెద్దలనాటి పెట్టెలయపుడు నేలదించిరి
పెట్టెలు యపుడు తెరచినాడు వెంగళరాయుండు
సరిగెపాగా చక్కబెట్టెను వెంగళరాయుండు
సొగసైన అంగీదొడగె వెంగళరాయుండు
అంగీమీద బంగారువంటి దట్టికట్టినాడు

కంఠహారము మెత్తియపుడు మెడనుధరియించెను
బంటులచూచి చెప్పసాగెను వెంగళరాయుండు
బారాతేజీని యిపుడు బేటికితెన్నండి
నేలమిద్దెలో భూమికావులో తేజియున్నాది
పిల్లలపిడుగు బారాతేజీని బేటికితెస్తాగు
వేసినారయ్యా తేజికక్కడ వెండిపల్లెములు
కట్టినారు తేజికక్కడ వెండిపల్లెములు
కట్టినారు తేజికక్కడ కొంతా పల్లెములు
మెడలుమీద జడలుయపుడు తాయుగ వేసిరి
పట్టుత్రాళ్ళతో బంధించిరి బారాతేజీని
వెంగళరాయుండు బేటికియపుడు తీసుకవచ్చిరి
తేజియొక్క శృంగారములే కన్నులచూచెను
చదురువిడిచి లేచినాడయ్యా వెంగళరాయుండు
చిన్నచెంబు వుదకమపుడు తెప్పించినాడయ్యా
తేజియొక్క పాదములు తానె కడిగెను
పాదములకు పూజచేసెను వెంగళరాయుండు
చుట్టువచ్చి వందనమొసగెను వెంగళరాయుండు
అంకెమలోనె పాదములుంచె వెంగళరాయుండు
యెగిరినాదిర బారాతేజి యోజనపొడుగున
నడిచినాదిర బారాతేజి నందనుగానుదా
నాలుగుప్రక్కల త్రిప్పినాడు బారాతేజిని
యాభైముగ్గురు యల్మాదొరలు వెంటనేవచ్చిరి
తట్టుకోట పుట్టుకోట సందుకువచ్చెను
తట్టుకోట జండాకొయ్యా కన్నులచూచెను
పుట్టుకోట జండాకొయ్యా కన్నులచూచెను
యెంచరాని కోపముగలిగె వెంగళరాయుడికి
పుట్టుకోటలో ప్రాంచివారి పారాలున్నారు
యల్మాబిడ్డలు తిరిగియపుడు కన్నులజూచెను
ముందువెనుక జూడవద్దు యల్మాదొరలారా

సైగచేసి నడచినాడు వెంగళరాయుండు
పారామీద కలపటమైరి పారాదొరలుదా
రెండుచేతుల పట్టాకత్తుల త్రిప్పాచు వచ్చిరి
పారాలమీదనె బోయిదూరెను వెంగళరాయుండు
కళివళీ కళివళీ యాంటా కార్యము జూపెను
పుట్టుకోటలో యుంచెపారా సాపుచేసినారూ
జండాకొయ్య నరికితోచెను భూమికి పైగాను
పుట్టుకోటను బట్టుకొన్నాడు వెంగళరాయుండు
తట్టుకోటపారాలమీదను కలపటమైనారు
తట్టుకోట పారాలన్ని చంపితోసినాడు
తట్టుకోటలో జండాకొయ్యను భూమిలో దాచిరి
తెట్టుకోట పట్టుకున్నాడు వెంగళరాయుండు
మూలబురుజు పారాలమీదను కలపటమైనారు
మెడనువంచి వీపున గుద్దిరి బాకుతో యపుడుదా
మూలబురుజుపారాలన్ని సాపుగ జంపిరి
కోటకు బైట దుమికినాడు వెంగళరాయుండు
వానివెంటనే దుమికినారు యల్మాదొరలుదా
కాలుతో సైగచేసే బారా తేజిని
అగడ్తకెంబడీ దూకి రేను బారా తేజిని
నాలుగుదిక్కులు చూచినాడు వెంగళరాయుండు
యెటుప్రక్క చూచినగాని దండేయున్నది
యన్నలార తమ్ములార యల్మాదొరలార
ముందువెనుక జూడవద్దు యల్మాదొరలార
చచ్చెడివారికి వీరస్వర్గము యిక్కడ గలుగును
జగముయుండు కాలమువరకు యుండబోతామా
రాముడు యేలినట్లుగా కోటను యేలబోతామా
ధయిర్యపుమాటలు చెప్పినాడయ్యా వెంగళరాయుడు
పూలకోత కోయించినాడు వెంగళరాయుడు
సూర్యనోను వీధులక్కడ యేర్పరిచాడు

హరోళ్యా హరోళ్యాలుయని తరిమి నరికాడు
వంచినయీ కెలమీద వాగులు యాడికి
ముండముండగా నరికితోసెను వెంగళరాయుడు
మోకాలి రక్తముముండ మొంగగచేసెను
రక్తములోనే మొండెము లన్ని పైకి తేలింది
వేటువేటున నరికినాడు యేనుగులన్నియు
గుద్దిగుద్ది చంపినాడు గుర్రాలసాజుదా
కలగోకలగోయంటు వారు వస్తువున్నారు
పోయినంతదూరము వాక పీనుగబడ్డాది
అన్నలారా తమ్ములారా యల్లాదొరలారా
జత్తులను చంపిన సార్ధకమేమి యల్లాదొరలారా
రాజుగారిని చంపి మనము పేరెత్తవలెను
ప్రాంచివారిని చంపి మనము పేరెత్తవలెను
ప్రాంచివారిడేరాప్రక్కకు గుఱ్ఱాన్ని త్రిప్పిరి
అప్పుడేమని చెప్పినాడు ప్రాంచిదొరగారు
యిప్పుడు జరిగె యుద్ధము యెవరిదన్నాడు
వెంగళరాయుడు యుద్ధము యిక్కడ జరుగుతు యున్నాది
యధికదండు హతమైపోయెను ప్రాంచిదొరలుదా
డేరాకాకకి వస్తువున్నాడు వెంగళరాయుడు
వెంగళరాయుడు యిక్కడవస్తె జయించలేమండి
ఈరీతిగ చెప్పినాడయ్యా హయిదరు జాగోజి
ఈమాటలు విన్నాడయ్యా ప్రాంచిదొరగారు
యేనుగయెక్కి కొండప్రక్కకు ప్రాంచివెళ్ళెను
ప్రాంచిపోయినసంగతి విన్నాడు విజయరామరాజు
గుఱ్ఱము యెక్కి వచ్చినాడు విజయరామరాజూ
యేరుదాటి వేలూగుకిపోయె విజయరామరాజు
ప్రాంచివారి డేరావద్దకు వచ్చి నిలచినాడు
ప్రాంచివారి డేరాలోగా పోయి జూచినాడు
ప్రాంచిలేదు యెవరు లేరు డేరాలోను

యెంతలో బలశాలి ప్రాంచిదొరగారు
విశ్వాసము లేని యల్పుడు నీవు ప్రాంచిదొరగారు
బొబ్బిలివారి బలము నీకు తెలిసేయున్నది
తెలిసియుండి బొబ్బిలికోటకు యేలవస్తిరి
వచ్చినవాడు యెదుటయుండక యెందుకుబోతివి
డేరాటంగులు తెంపినారయ్యా వెంగళరాయుండు
డేరాగుడ్డలు చింపితోసెను వెంగళరాయుండు
కిందుమీదుగ చేసినాడయ్యా ప్రాంచిడేరా
రాజుగారి డేరావద్ద గుఱ్ఱాల త్రిప్పెను
డేరాలోగా శోధించినాడు వెంగళరాయుండు
రాజు లేరు యెవ్వరు లేరు డేరాలోగాను
యెంతకోస బంటవు నీవు విజయరామరాజు
కొప్పుబెట్టి కోకలుగట్టి కోటలో యున్నావా
హీనము మానము లేనివాడు యెందుకువస్తిరి
సీతాలతంద్రులు బొబ్బిలిమీద హతమైపోయిరి
తెలిసియుండి బొబ్బిలికోటకు యేలవస్తివి
డేరాలన్ని నరికిత్రోచెను వెంగళరాయుండు
రచ్చాబండా రేవులకాడ గుఱ్ఱాన్ని త్రిప్పెను
నిమిషమువరకుదా సిదానించెను వెంగళరాయుండు
బావమరిది రాక యపుడు జూస్తుయున్నాడు
పాపారాయుడు రాక యపుడు జూస్తుయున్నాడు
యెంతజూచినగాని రాలేదయ్యా పాపారాయుండు
అప్పుడేమని చెప్పినదయ్యా వెంగళరాయుండు
లాల్ఖానుడేరా యపుడు కన్నుల చూచెను
గుడారము చూచినంతలో కోపము వచ్చెను
యింతలోకి యేమన్నారు యల్లాగొంగలు—
దాహము దాహము దాహము మాకు వెంగళరాయుడ
కోటకుపోయి దాహము త్రాగి తిరిగివస్తాము
యీకేమిగా చెప్పినారయ్యా యల్లాగొరలుదా

లాల్ఖాను డేరాయందు కన్నులజూడండి
డేరాయందు సంగతి తెలిసి యాకలి యెత్తునా
లాల్ఖానుచంపి మనము కోటకు పోతాము
కోటకు పోయి దాహాము తాగి తిరుగావస్తాము
యీరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుండు
యెంతజూచిన రాలేడయ్యా పాపారాయుండు
లాల్ఖానుడు దండువద్దకు వస్తువున్నాడు
అప్పుడెట్లా యోచించెను లాల్ఖానుడైతేను
మూడుపుట్ల నల్లమందు భూమిని పరచెను
భూమినపరచి యప్పుడే వాడు మందుకు లోగాను
కూరుకత్తులు యీటికత్తులు మందుల వేసెను
మున్నూట కవాతుగుర్రము ముందుగ నడిపించె
రామ రామ రామ యంటు వస్తుయున్నాడు
గుర్రమని దూకినారు యల్మాందొరగలుదా
తెలియకవచ్చి నల్లమందలో యిపుడె బడ్డారు
నాలుగుప్రక్కల జానకిత్రాళ్ళు తగిలించినారు
భగ్గుభగ్గున రగిలెనయ్యా మందులు యంతాను
ముందుకు వెలువడి దుమికినాడు వెంగళరాయుండు
కూడయున్న యల్మాబిడ్డలు మందున చచ్చిరి
వొంటిగా నిలచెనయ్యా వెంగళరాయుండు
నిప్పులుబెట్టి జాతులవారిని గొంతులు కోసెను
యుద్ధముచాలా చేస్తున్నాడు వెంగళరాయుండు
ముందుచుట్టు పారాలన్ని సాపుజేసినాడు
పక్కగా నిలచియుండు టుపాకులబారు
అరవైరెండు టుపాకులాడ టుప్పున కాల్చిరి
పళపళయని కాల్చినారు టుపాకిలంతాను
చుక్కవంటి టుపాకిదెబ్బ నెత్తిన తగిలెను
వీపున తలిగిన గాయాలన్ని యెంచతరముగాదు
సూర్యునిలాగు రక్తము కూడ గారుతున్నాది

కండలు పేగులు జీరాడెను వెంగళరాయుడికి
జీరాడె పేగులుయెత్తి దట్టిలో గట్టెను
కూరుగలిగిన బల్యమపుడు చేతయెత్తినాడు
తరిమి తరిమి నరికినాడయ్యా తొంబయి మందిని
నిల్వజాలక మూర్ఛజెందెను వెంగళరాయుండు
వెంగళరాయుండు చచ్చినాడని ఢంకాకొట్టిరి
ఢంకాశబ్దము విన్నాడయ్యా కీనుమదాలుదా
పచ్చలపల్లకి యెత్తినారయ్యా కీనుమదాలుదా
రెండుచేతుల కట్టాకత్తులు త్రిప్పుచు యపుడుదా
సందుకులోగా దూరినాడు కీనుమదాలుదా
రచ్చాబండ రేవులకాడ తాయిగ వచ్చిరి
వెతుకుతు వెతుకుతు వస్తున్నారు కీనుమదాలుదా
వెంగళరాయుడు బేటికివచ్చి కీనుమదాలుదా
పచ్చనిపల్లకియందు కొల్వుతీర్చినారు
పన్నెండుమంది బోయవారు పల్లకియెత్తిరి
రాజనివాణము తెచ్చినారయ్యా వెంగళరాయన్ని
హాజారముయెదుట వచ్చెను రంగయ్యదొరగారు
పల్లకిలోని తమ్ముడు యపుడే బ్రతికియున్నాడు
పల్లకి యపుడె దింపినారు రంగయ్యదొరగారు
రవ్వశల్ల ముసుగుయెత్తి కన్నుల చూచెను
ఘొల్లుఘొల్లున దుఃఖించెను రంగయ్యదొరగారు
కుడిభుజము కూలుపోతి, వెంగళరాయుడా
యెంతటిదండులో పోరుచేసితివి వెంగళరాయుడా
యీరీతిగా చెప్పినాడయ్యా రంగయ్యదొరగారు
అంతలోగా మూర్ఛదెలిసెను వెంగళరాయుడికి
అన్నను యపుడు కన్నులజూచెను వెంగళరాయుండు
కంటియందు నీరుబెట్టెను వెంగళరాయుడు
యుద్ధమునకు పోతావేమో అన్నయ్యదొరగారు
సల్లమందు సైగలువారికి చాలాయున్నది

యుద్ధమునకు పోలేవాలు కోటకు రావయ్యా
రాజస్త్రీలకు ప్రె చికూడు తినిపించవద్దు
కోటలోపల కాలిబందకం తానావున్నది
బందకాలు వదలించుకొని తాయిగ పొన్నండి
యిన్నిమాటలు చెప్పి యపుడు జీవమిడిచినాడు
జిల్లగుంట బయలునందు చిచ్చు బంపించి
దహనమపుడు చేసినాడు వేంగళరాయుని
మూడునిమిషములకు నిత్యకర్మము తాను జేసికొని
కొలువుచావిడికి వచ్చినాడు రంగయ్యాదొరగారు
సాగిసుదిండ్లు దివాసుమీద కొలువు తీరినాడు
తన్నుకొలిచే రాణువలంతా కొలువుకు వచ్చిరి
ఈకథలు యీలాగున్నది కోటకులోగాను
మరిదిచచ్చిన సంగతిమెరిగెను మల్లమ్మదేవిదా
పెద్దకూతురు సీతమ్మను దాను పిలుచుకొని
తోడికోడలు సుభద్రమ్మను తాను పిలచుకొని
యేడుగురు మేనత్తలతోను తాను పిలచుకొని
కోటలోయుండు గోపాలస్వామి దేవాలయమునకు
దేవాలయమునకు కదలివచ్చెను దేవీమల్లమ్మ
అభిషేకమును చేసికట్టెను స్వామికి యపుడుదా
జాజిమల్లెల పుష్పాలవల్ల పూజలు చేసెను
తులసీదళములచేత స్వామికి పూజలుచేసెను
స్వామియొక్క శిరమునకు కిరీటము వెట్టెను
స్వామినత్తికి తిరుమణి ఎండీ తాయిగ పెట్టెను
స్వామిభుజములకు శంఖుచక్రములు బెట్టెను
నాలుకు నూరు చిన్నదివ్వెలు వెలిగించి
యెదుటపీదల గోపాలస్వామిని వేడుకొన్నది
కలలోవచ్చి సహాయము చేయుము గోపాలస్వామి
నాన్యాయంబు పుణ్యంబుదా తెలియచెప్పండి
యెదు నిలిచి వేడుతున్నది గోపాలస్వామిని

కంటినిండు నీరుబెట్టెను గోపాలస్వామిదా
అపశకునంబులు చెప్పుతుయున్నాడు గోపాలస్వామిదా
నొష్టయున్న తిలకమణి రేఖ నేలనుబడ్డాది
మెడలోయున్న పూలహారము తెగి నేలబడెను
యెదుటయున్న యఖండదీపము గప్పునయూరెను
తూర్పుయున్న గోపాలస్వామిని పడమటతిరిగెను
పడమటయున్న గాలిగోపురము పటపటపగిలింది
కానరాని చీకటియపుడు కమ్మెను గుడిలోన
గుడివిడిచి బైటికివచ్చెను మల్లమ్మదేవిదా
అలంగారము యెక్కినాది మల్లమ్మదేవిదా
రాజుగారి డేరాయపుడు కన్నులచూచెను
మమ్ముచంప యెన్నాళ్ళునీవు మనస్సునుంచినావు
కొండలుబడ్డ కొన్నాళ్ళకైనా కోసలుపడుతుంది
దోవలోకబురు వింటాడయ్యా పాపారాయుడు
రేపురేయి వస్తాడయ్యా పాపారాయుడు
పట్టెమంచం పరుపుమీద పవ్వళించియుండగా
వొక్కపోటు పొడుస్తారయ్యా పాపారాయుడు
పుట్టినునల్లలు పుట్టినుగాజులు యొక రేవులోన
నీకు పెండ్లాము తెంచను యపుడు జాతకమున్నాది
రాజదివాణము వచ్చింది మల్లమ్మదేవిదా
సంవత్సరముగల చిన్నవాడు వెంకట్రాయుడు
బాలునియపుడు యెత్తుకున్నది మల్లమ్మదేవిదా
చెక్కిళ్ళుదువ్వి చేరిముద్దులాడె మల్లమ్మదేవిదా
కొడుకా కొడుకా నీవు వెంకట్రాయుడా
తల్లికడుపు నోచిననోమో వెంకట్రాయుడా
కడపటిసారి స్తన్యపానము తాగుర నాతండ్రి
గర్భమునిండ స్తన్యపానము తానిచ్చెను
బంగారుగజ్జలన్ని తీసివేసినాది
కాళ్ళనుండి కడియాలన్ని తీసివేసినాది

మారువేషము వేసినాది బాలునికై తేను
యందరికయినా పెద్దదాది వెంకటలక్షుమమ్మ
వెంకటలక్షుమమ్మను గొలువునకు తానుబిలచినాది
కందలువంటి కోకగట్టెను వెంకటలక్షుమమ్మ
మసిబొగ్గు బెట్టినయ్యా దుత్తకుయపుడుదా
డేరావద్ద నీవు భిక్షమెత్తుకొని
రాజారము చేరవలెను వెంకటలక్షుమమ్మ
పాపారాయుడు బేటికియిపుడు మీరేపొన్నండి
ఈరీతిగ చెప్పినాది మల్లమ్మ కేవిదా
యిక్కడజరిగిన సంగతులన్నియు యిపుడుతో చెప్పండి
చాపకన్ను దరరాజాగుండా వారు వెళ్ళినారు
అచ్చటనుండి వచ్చినాది వెంకటలక్షుమమ్మ
డేరావద్ద యపుడు భిక్షమెత్తింది
ప్రాంచివారి దండుకులోగా భిక్షమెత్తుకొని
భిక్షమెత్తుకొనిదా వస్తున్నది వెంకటలక్షుమమ్మ
ఆవేళలో రాజు ప్రాంచి సామీనులైనారు
డేరాబైట కొలువుతీరిరి వేడుకగాను
రాజుదొరి చుక్కాణిపరీక్ష చెప్పుతుయున్నారు
చుక్కాణిలో పరీక్ష యపుడు చెప్పుతుయున్నారు
సలామయ్యా సలామయ్యా ప్రాంచిదొరగారు
పరాకులేక వినుమయ్యా ప్రాంచిదొరగారు
బొబ్బిలివారి పోతుదూడదా వెలపటపోతాది
రాజామరిది చిన్నవాడు వెలుపటపోతాడు
పోనివ్వకు పోనివ్వకు బాలునిమైతేను
చుక్కానియపుడు చేతికందెను ప్రాంచిదొరగారు
చుక్కానిలో జూచెనయ్యా ప్రాంచిదొరగారు
పరాకుంచక వినుము యిపుడు విజయరామరాజు
మన్మథుని సమానముగా యున్నాడు
చంపరాదుర చంపరాదుర బాలునిగనుకాను

ఈరీతిగా చెప్పినాడయ్యా ప్రాంచిదొరగారు
ఈమాటలు విన్నాడయ్యా విజయరామ రాజు
ముందు ముందు సాధించబోతాడు బాలుడైతేను
శెలవివ్వండి శెలవివ్వండి ప్రాంచిదొరగారు
అట్టిమాటలు యేమన్నాడు ప్రాంచిదొరగారు
హర్కారులను పిలపించెను ప్రాంచిదొరగారు
వెంకటలక్ష్మి బేటికివచ్చిరి హర్కారు లపుడుదా
నీదుపేరు యేమన్నారు హర్కారులపుడుదా
నాదుపేరు వెంకటలక్ష్మి యని పేరుజెప్పినాది
యేయూరు యేపల్లె వెంకట లక్ష్మమ్మ
కోటలుక్రింద పేటలుమాది పారాచౌకీలు
భిక్షమెత్తబోతున్నాను పారాచౌకీలు
ప్రాంచివారు పిలువమన్నారు వెంకటలక్ష్మమ్మ
ప్రాంచివారి డేరావద్ద తీసుకవచ్చిరి
కోటలుక్రింద పేటలెమాది ప్రాంచిదొరగారు
భిక్షమెత్త బోతున్నాడు ప్రాంచిదొరగారు
మైలవేసము వేసినాది వెంకటలక్ష్మమ్మ
రంగారాయుడు కొమారుడు వెంకట్రాయుడు
యింతలోపల యేమన్నాడు విజయరామరాజు
పోనివ్వద్దు పోనివ్వద్దు వెంకటరాయున్ని
ఆమాటలకు యేమన్నాడు ప్రాంచిదొరగారు
పాపకర్ముడు బహుచండాలుడు విజయరామరాజు
కర్మచండాలుడు కులద్రోహులుడు విజయరామరాజు
నెత్తురుముద్ద చంపవద్దుర విజయరామరాజు
యంతలోపల మరియేమన్నాడు విజయరామరాజు
చూడగా పసిబాలుడయ్యా ప్రాంచిదొరగారు
బొబ్బిలివారి బలమును పరీక్ష చూడండి
యీరీతిగా చెప్పినాడయ్యా విజయరామరాజు
యిన్నిమాటలు విన్నాడయ్యా ప్రాంచిదొరగారు

బాలునియపుడు చేతతీసెను ప్రాంచిదొరగారు
చెక్క ళ్ళయినా దువ్వినాడు బాలుని అయితేను
తొడపై కూర్చుండబెట్టె బాలుని అయితేను
చదరుచాల యమర్చినాడు బాలుని అయితేను
వొక్కప్రక్క పండు ఫలాదులు రాసిబోసినాడు
వొక్కప్రక్క చంద్రాయుధము తాను బెట్టినాడు
బాలుని యపుడు విడిచిరి విజయరామరాజు
చూచితె బాలుడయ్యా ప్రాంచీదొరగారు
బొబ్బిలివారి బలముల తా కన్నులచూడండి
దోగాడుతు వచ్చినాడయ్యా వెంకట్రాయుడు
పండ్లు ఫలాదులు తాకలేదు వెంకట్రాయుడు
గుడ్డుదగ్గాని తాకలేదయ్యా వెంకట్రాయుడు
చంద్రాయుధము వద్దకువచ్చె వెంకట్రాయుడు
మండివేసి కొలువు తీరెను వెంకట్రాయుడు
చంద్రాయుధము చేతబట్టెను వెంకట్రాయుడు
ప్రాంచివారిని వురిమిచూచె వెంకట్రాయుడు
రాజుగారిని వురిమిచూచె వెంకట్రాయుడు
బాకుయెత్తి వురిమినాడయ్యా వెంకట్రాయుడు
దిగులుజెంది నిలిచెనయ్యా ప్రాంచిదొరగారు
తగురానాయన తగురానాయన బొబ్బిలివారికి
క్రూరకర్ముడా కులద్రోహుడా విజయరామరాజు
యింతటి వస్తాదిబిడ్డలు బొబ్బిలిదొరలుదా
యింతదూరము బోతున్నావే వెంకటలక్ష్మమ్మ
యింకొక రాజ్యము నేనిపుడు బోతువున్నాను
మంచిదన్నాడు బాగన్నాడు ప్రాంచిదొరగారు
రాజుగారిని నమ్మలేక ప్రాంచిదొరగారు
ముప్పయియింటి సోల్జరులను యప్పుడు బిలచెను
గాటుయొక్క పారాలిప్పుడు గట్టిగ పొమ్మండి
యెచ్చటనుండీ పొమ్మంటాదో వెంకటలక్ష్మమ్మ

ఉచ్చటనుండి రావలెనయ్యా పారాచౌకీలు
యీరీతిగా చెప్పినాడయ్యా ప్రాంచిదొరగారు
అక్కడనుంచి వచ్చినారయ్యా పారాచౌకీలు
నల్లకొండ దాటినారయ్యా పారాచౌకీలు
కొంతదూరము వచ్చినారయ్యా పారాచౌకీలు
రాజారంపుసమీపమున కదలి వచ్చినారు
అక్కడనుంచి పొమ్మన్నాది నె టలక్షుమమ్మ
రాజారంపుబాటలు త్రొక్కిపోతూవున్నది .
ఆకథలు ఆలాగున్నది దారికిలోగాను
కోటలోపల యున్నాడయ్యా రంగయ్యదొరగారు
ఆలోచనలుచేసినాడు రంగయ్యదొరగారు
బావమరిది నర్సారాయుని కొలువుకు బిలచెను
కొలువుకు యిప్పుడు కదలివచ్చెను నర్సారాయుడు
బావమరిది, బేటికివచ్చి వందన మొసగెను
పరాకుంచక వినుము యిప్పుడు నరసారాయుడా
కోటలోపల గాలిబందము చాలాయున్నది
బందకాలు వదలించుకొని బేటికి రన్నండి
చేతయున్న పట్టాకత్తి చేతికి యిచ్చెను
పట్టాకత్తి తీసుకొన్నారు నరసారాయుండు
యేమి తెలియక నిలిచినాడు నరసారాయుండు
దగ్గరకపుడు పిలిచినాడయ్యా నరసారాయున్ని
చిటికెవంటి విభూతిని మంత్రించినాడు
విభూతివత్తి నొస్టబెట్టెను నరసారాయుడికి
యెంచరాని కోపము గలిగె నరసారాయుడికి
రాజదివాణం వచ్చినారయ్యా నరసారాయుడు
మల్లమ్మదేవి ముందుకొచ్చెను నరసారాయుడు
పగడశాల ఆడుతు వున్నది మల్లమ్మదేవిదా
అన్నతమ్ముని కన్నుల చూచెను మల్లమ్మదేవిదా
— చేతియొక్క పట్టాకత్తిని కన్నుల చూచెను

పరాకుంచక వినుమయ్యా అన్నయ్యదొరగారు
వచ్చినపనులు కానివ్వుమయ్యా నరసారాయుడా
వెనుకయున్న కీలుగంటు ముందుగ వేసెను
కొయ్యమని మెడచాపెను మల్లమ్మదేవిదా
గరగరగరగర గరగరయంటు గొంతుకోసినాడు
పెద్దకూతురు పెరుందదేవిని గొంతుకోసినాడు
నడిమికూతురు కాంతమ్మను గొంతుకోసినాడు
చిన్నకూతురు సీతమ్మను గొంతుకోసినాడు
యేడుగుర మేనత్తల గొంతుకోసినాడు
తోడికోడలు చంద్రమ్మను గొంతుకోసినాడు
ధర్మారాయుని భార్యయైన రమణమ్మదేవిదా
నిండుగర్భమున యున్నదయ్యా రమణమ్మదేవిదా
అప్పుడేమని పలికినాడు నరసారాయుడు
అంటరాదు ముట్టరాదు రమణమ్మదేవిదా
మొలలోయున్న చంద్రాయుధము బఱ్ఱున దూసెను
బాకుమెత్తి ముందుర వేసె నరసారాయుండు
అప్పుడేమి చెప్పినాదిర రమణమ్మదేవి
మాడువేసి కొలువుదీరెను రమణమ్మదేవి
బాకుమెత్తి రొమ్మునవేసి పడ్డాది
గర్భము యపుడు చీల్చినాడు ధర్మారాయుడు
నెత్తురుముద్ద శిశువును దాని యెగరవేసినాడు
పట్టాకత్తి యెదుటబెట్టెను ధర్మారాయుడు
వేటుమొకటి తునకలు రెండు భూమినపడ్డాది
బందకాలు వదలించుకొని ధర్మారాయుడు
రంగారాయుడు బేటికివచ్చెను నరసారాయుడు
బందకాలు తీర్చుకొని బావరంగయ్యా
తన్నుగొలిచే రాణువలంతా తాను బిలచినాడు
మీబందకాలు వదలించుకొని నాబేటికిరమ్మండి
యీరీతిగా చెప్పినాడయ్యా రంగయ్యా దొరగారు

వారివారి దివాణమునకు కదలివచ్చిరి
తలలుబట్టి గొంతులుకోసిరి యల్మాదొరలుదా
భార్యలనంతయు గొంతులుకోసిరి యల్మాదొరలుదా
బిడ్డలనెవతె గొంతులుకోసిరి యల్మాదొరలుదా
వారివారి బంధకాలు వదలించుకొన్నారు
కోమటివీధులు బ్రాహ్మణవీధులు పూరావున్నాది
యందరిని చంపుమయ్యా రంగయ్యదొరగారూ
మందుగిడంగి పగులగొట్టండి మందులపరచండి
మందులకొట్టడిలోపలయున్నను స్త్రీలనుతరలి
తల్పులుమూసి తగలపెట్టండి యల్మాదొరలారా
ఈరీతిగా చెప్పినాడయ్యా రంగయ్యదొరలుదా
మందుగిడ్డంగి పగలకొట్టిరి యల్మాదొరలుదా
గుంపులుగాను రగిలినారు స్త్రీలందరును
దీపముబెట్టను దిక్కులేదు కోటకులోగాను
రంగారాయుడు బేటికివచ్చిరి యల్మాదొరలూదా
తామసమేమి యింకామీరు తయారుగరన్నండి
బంగారువెండినంతయు తెప్పించెను రంగయ్యగారు
ఇనుపయొక్క హుండీలను తెప్పించినాడు
హుండీలోపలవేసినాడయ్యా రంగయ్యదొరగారు
యినుపగొలుసు తగిలించిరి హుండీలకుదా
యినుపరోళ్ళు తెప్పించినాడు రంగయ్యదొరగారు
గొలుసులకు దగిలించెను రోళ్ళుయంతాను
బావిలోగదింపినాడయ్యా ఆస్త్రియంతాను
బండవేసి పైనమూసె రంగయ్యదొరగారు
బండలమీాద శాసనంబువ్రాసె నప్పుడుదా
లేచిరలగోత్రమునకు యెవ్వరువచ్చితేను
ఆస్త్రియంతయువారికి యింపుగచిక్కవలెను
యితరులొచ్చిన చిక్కరాదు యీాఆస్తిఅంతయు
ఈరీతిగా శాసనములువ్రాసెను రంగయ్య

మూడుమనుష్యుల పుత్తెలను తెప్పించినాడు
నెత్తురుకూడు చల్లించినాడు రంగయ్యదొరగారు
రణమోరణమోయంటూ రణము కున్నినాడు
బారాతేజిని యప్పుడు తెప్పించినాడు
తన్నుగొలిచె రాణువలంతా ప్రయాణమయినాది
కోటవిడిచి బైటవచ్చెను రంగయ్యదొరగారు
కోటప్రక్కనె తిరిగిచూచె రంగయ్యదొరగారూ
వందనముచేసె కోటకుయపుడు రంగయ్యదొరగారు
నేటివరకుమాకు కోటకు ఋణముతీరెను
దండుప్రక్క తిరిగినాడు రంగయ్యదొరగారు
బావమరిది నరసారాయుడు రంగయ్యదొరగారు
బావమరిది ధర్మారాయుడు వెంటనేవస్తారు
అన్నలార తమ్ములార యల్మాదొరలార
ముందువెనుక జూడవద్దు దండుకులోగాను
మీరుబలములు జూడండయ్య దండుకులోగాను
అనంతకాలముమనము యేమిరాజ్య మేలలేము
చచ్చినవారికి వీరస్వర్గము యిక్కడగలుగును
ధైర్యములు చెప్పినాడు రంగయ్యదొరగారు
దండుమీద కలపటమైన యల్మాదొరలూదా
చుట్టుప్రక్కల యున్నాడయ్య ఫ్రాంచిదండుదా
బల్యంమీద సాపుచేసి చొచ్చరించినాడు
వంచివంచి యీటెలతోను వాదులాడినారు
చేతులుబట్టి యపుడు చెలగి గుమ్మినారు
మెడనుబట్టివంచి యపుడు బాకున గుమ్మెరి
ముండములోనే జొరబడ్డాడు రంగయ్యదొరగారు
మోకాలులోతు రక్తమూడ పారుతుయున్నాది
కావుకావుమన ఫ్రాంచిదండు కొండకేగిరి
కొండగుహలో దాగినారు ఫ్రాంచిదండుదా
అప్పుడేమని చెప్పినాడు రంగయ్యదొరగారు

వీరిని చంపితే సార్థకమేమి యల్మాదొరలారా
రాజుగారిని చంపితేను పేర్లు గలుగును
ప్రాంచివారి చంపితేను పేరులు గలుగును
ప్రాంచివారి డేరావద్దకు గుఱ్ఱము త్రిప్పెను
ప్రాంచివారి డేరాకొచ్చె హైదరుజంగోజి
యిప్పుడు జరిగేయుద్ధము చాలా పెరుగుతున్నాది
రంగయ్యదొరగారియుద్ధము చాలా పెరుగుతున్నాది
పట్నపుదొర రంగయ్యగారు వస్తువున్నాడు
తెలియక మనము చంపినాము బొబ్బిలిదొరను
కర్మచండాలరాజు మాటలు మనమే వింటిమి
యీవిధంబున జెప్పినాడు హయిదరు జంగోజి
ముప్పైయింటికి ఫుక్కజీరపుసైతుల పిలిపించి
అప్పుడేమని చెప్పినాడయ్య ప్రాంచిదొరగారు
పరాకుంచక వినుము యిపుడు పారాచౌకీలు
బొబ్బిలిదొర రంగారాయుడు వస్తువున్నాడు
రంగారాయుడు యెదురు ఊరు తాయిగ పోన్నండి
కోలుకోలుయంటు యెదురుగ పోన్నండి
యేమికోలుయని యడిగితే రంగయ్యదొరగారు
యెప్పటివలెనే బొబ్బిలికోటకు యేలుకొనండి
మరల ప్రత్తరవు తెన్నండోయి హరకారులు మీరు
యీరీతిగా చెప్పినాడయ్య ప్రాంచిదొరగారు
రంగారాయుడు యెదుటవారు తాయిగ వచ్చిరి
కోలుకోలు యంటు యెదుటనె వచ్చిరి
యేమికోలు మాకిస్తారు మాయన్నలారమీరు
యెప్పటివలెనె బొబ్బిలికోటలు యేలుమన్నారు
అట్టిమాటలకు యేమన్నాడు రంగయ్యదొరగారు
చాలుచాలు చాలించుమోయి రౌతులుమీరుదా
అన్నతమ్ములు బావమరదులు యందరువచ్చిరి
వొంటికాడు నేనైతిని కోటలు యెందుకు

కన్నుసయిగ చేసినాడు రంగయ్యాదొరగారు
ముప్పైయింటికి వుక్కుజీరవు రౌతులచంపిరి
గిరగిరమని తిరిగి యప్పుడు భూమినపడ్డాడు
మరుప్రత్తరువు లేకపోయె ప్రాంచివారికిని
అప్పుడెట్లా వున్నాడయ్యా ప్రాంచిదొరగారు
యేనుగనెక్కి కొండలప్రక్క ప్రాంచివెళ్ళెను
ప్రాంచిపోయినసంగతి తెలిసెను విజయరామరాజు
యేరుదాటి యేలూరికి తాను వెళ్లినాడు
అక్కడనుంచి వచ్చినాడు రంగయ్యాదొరగారు
ప్రాంచివారి డేరావద్దకు ఠాయిగవచ్చిరి
డేరాలోగా శోధించెను రంగయ్యాదొరగారు
ప్రాంచిలేదు యెవ్వడు లేడు డేరాలోగాను
యెంచరాని గోపముగలిగె రంగారాయుడికి
పిరికిబంటు వీడుయిపుడు యెందుకువచ్చెను
మీసములేని పేడివారు యెందుకువచ్చెను
డేరా టంగుత్రాళ్ళ యపుడు ఠాయిగ తెంపిరి
క్రిందుమీదుగా చేసినాడు డేరాలంతయు
ప్రాంచివారి దండుకుపయిగా బాగుగవచ్చెగా
అచ్చటనుండి వస్తున్నాడు రంగయ్యాదొరగారు
రాజుగారి డేరావద్ద టాయిగవచ్చిరి
రాజులేడు యెవ్వరులేరు డేరాలోగాను
పరాకుంచక వినుము యిపుడు విజయరామరాజు
బొబ్బిలివారిబలము నీకు తెలిసియున్నాది
నీతాత తండ్రులు బొబ్బిలిమీద హతమైపోయిరి
పుట్టినచోట చావడానికి బ్రహ్మవ్రాయలేదు
బొబ్బిలిమీద చావడానికి బ్రహ్మవ్రాసినాడు
హీనము మానములేక యిపుడు యెందుకువస్తివి
మీసములేక యేలనీవు యిక్కడికొస్తివి
వచ్చినవాడు యెదుట నిలువక యేలబోతివి

యీలాగు చెప్పినాడు రంగయ్యదొరగారు
డేరాగుంటత్రాళ్ళను యపుడు తెంపుగ తెంపిరి
క్రిందుమీదు చేసినాడు డేరాలంతాను
రాజుగారి గండుమీదను తాయిగపొడిచేను
డేరావిడిచి బైటికివచ్చెను రంగారావుదా
నాతమ్ముడు చచ్చినచోటు ఏదిర యన్నలార యిపుడు
లాల్ఖానుడు డేరాయపుడు కన్నులచూచెను
లాల్ఖానుడు డేరావద్దకు గుఱ్ఱముత్రిప్పెను
దండుమీద కలపట్టైంది యల్లాదొరలుదా
హాళ్యాలు హాళ్యాలు చేసియపుడు తరిమినరికినాడు
యచ్చటయున్న పారాలన్ని సాపుగచంపిరి
లాల్ఖానుడు బేటికివచ్చె రంగారావుదా
అప్పుడెట్లా యున్నాడయ్యా లాల్ఖానుడుదా
యేనుగుమీదు అంబారిపై కొలువైయున్నాడు
తేజియపుడు చిమటాయిచ్చెను రంగారావుదా
ఏనుగుయొక్క కుంభస్థలముమీద తేజిపాదములు
యొకటిరెండు మూడుచాలా బాణము వేసెను
యెడమచేతిలో తట్టె [illegible] రంగయ్యదొరగారు
నీదుచెయ్యి ముం[illegible] చెర లాల్ఖానుడుయపుడు
నాదుచేయి వస్తుంది యాగత్తుకోర
పట్టాతోను నరికినాడు రంగయ్యదొరగారు
హల్లా హల్లా హల్లాయంటు భూమిపడ్డాడు
హైదరుజంగు దండుమీదికి కలపటమైనారు
బల్యముమీద చౌకరించెను సైన్యామంతయు
తరిమితరిమి నరికినాడు రంగయ్యదొరగారు
యెగిరియెగిరి చంపినాడయ్యా గుఱ్ఱాలగుంపును
మాస్టుకులను గొట్టినయపుడు ముందుగవేసెను
యెగిరితన్నగ భీరంగిగుండ్లు యిరుసులు యిరిగెను
రక్తములోనె మొండెములన్ని పైకితేలింది

అరవైమూడు రేఖలాలుగా మొహార్జాలెత్తిరి
ఫెళఫెళయని కాల్పినారు భీరంగియపుడుదా
వెనుకప్రక్కన యున్నాడయ్యా హైదరుజంగోజి
జయించలేము జయించలేము రంగారాయుడితో
అయిదుపుట్ల నల్లమందు భూమినిపఱచిరి
ఉక్కుకత్తులు సానకత్తులు మందున వేసిరి
రవలు చాలా వేసినారు మందుకుండలోగాను
నాలుగుప్రక్కల మందుత్రాళ్ళు తగిలించినారు
మున్నూటికి నివాతు గుఱ్ఱములుండగ నిలిపిరి
గుఱ్ఱమని దూకినారు యల్మాదొరలుదా
తెలియకవచ్చి నల్లమందులో గప్పునపడినారు
నాలుగుప్రక్కల మందుత్రాళ్ళకు నిప్పులుబెట్టిరి
భగ్గుభగ్గున రగిలెనయ్యా మందులు అపుడుదా
ముందువెలుపల దుమికినాడు రంగయ్యదొరగారు
కూడయున్న యల్మాదొరలు ముందునచచ్చిరి
రంగయ్యదొర బారాతేజి ముందునచచ్చింది
వొంటిగా నిలచినాడయ్యా రంగయ్యదొరగారు
నిప్పులుబెట్టె జాతులవారిని గొంతులుకోసెను
తరిమితరిమి నరికినాడు రంగయ్యాపుడా
అరవైరెండు తుపాకులంతా మొహర్జాలెత్తిరి
ఫెళఫెళయని కాల్చినారు టుపాకిలంతాను
చుక్కవంటి టుపాకిదెబ్బ నెత్తినతగిలింది
వీపునతగిలిన గాయాలన్ని మెంచతరముగాను
రక్తముయపుడు గారుతుయున్నది గాయాలగుండాను
పేగులుకండలు జీరాడెను రంగారాయుడికి
జీరాడె పేగులుయెత్తి దట్టిలోగట్టెను.
తరిమితరిమి నరికినాడు తొంబయిమందిని
నిల్వబలములేక క్రుంగెను రంగయ్యదొరగారు
యింతబ్రతుకు బ్రతికినేను వీరిచేతిలో

# పెద్ద బొబ్బిలి రాజు కథ

పిరిచేత చావను నాకు జాతక మున్నదా
మండివేసి కొలువుతీరెను రంగయ్యదొరగారు
బాకుయెత్తి పిసిరివేసెను రంగయ్య దొరగారు
బాకువచ్చి రొమ్మునతగిలి భూమినపడ్డారు
మండిమీదనే ప్రాణముపిడిచె రంగయ్య దొరగారు
రంగారాయుడు చచ్చాడని ఢంకా[illegible]ట్టిర
వెళ్ళిపోయిన దండు చాలా తి[illegible] వచ్చింది
కొండదాటి వచ్చినాడు ప్రాంచి[illegible]రగారు
రంగారాయుడు బేటికి రాజు వస్తువున్నాడు
రాజుగారు ప్రాంచివారు పామీలైనారు
రంగారాయుడికి చక్కదనము చూడవస్తాడు
అంతలోకి యేమన్నాడు విజయరామరాజు
నమ్మరాదు నమ్మరాదు బొబ్బిలివారిని
చచ్చినాడని దగ్గిరికైనా మనమే పోతేను
దిగ్గునలేచి లడాయిచేతురు బొబ్బిలి దొరలుదా
ఈరీతిగా చెప్పినాడు విజయరామదాజు
ఈటితోను కదలించినాడు రంగారావును
బొందెలోను జీవములేక తానే యున్నాడు
దగ్గరకైనా యప్పుడువచ్చె ప్రాంచిదొరగారు
యొడ్డుపొడుగా చక్కదనము కన్నులచూచెను
వీపునందు వింజామరలే రంగారాయుడికి
బొడ్డునందు చింతామణిదా రంగారాయుడికి
ముంజేతికి మీసమున్నది రంగారాయుడికి
రాజచిహ్నముల కన్నులచూచె ప్రాంచిదొరలుగా
ఘోడుఘోడున దుఃఖించినాడు ప్రాంచిదొరగారు
తెలియక నేను బొబ్బిలి దొరలను చంపుకొంటిని
క్రూరకర్ముడు కులద్రోహుడు విజయరామరాజు
కర్మచండాలుని మాటలు చాలా నేను వింటిని
[illegible] చండాలుని మాటలు చాలా నేను వింటిని

యిటువంటి వస్త్రాదులు భూమిని యుంచేను
ఈరీతిగా దుఃఖపడెను ప్రాంచిదొరగారు
చాలా సేపు దుఃఖపడెను ప్రాంచిదొరగారు
దహనమైన చేసినాడు ప్రాంచిదొరగారు
రాజువారు ప్రాంచివారు స్వామ్యాలైనారు
బొబ్బిలికోట వచ్చినారు యిద్దరు యపుడుదా
కోటలోను శోధించినారు యిద్దరు యపుడుదా
యేప్రక్క జూచినగాని స్త్రీమరణాంబు
యేనగరిలో జూచినగాని శిశువుల మరణాంబు
అప్పుడేమని చెప్పినాడు ప్రాంచిదొరగారు
స్త్రీహత్యయు శిశుహత్యయు యెవరిదన్నాడు
స్త్రీహత్యయు శిశుహత్యయు నాదెయన్నాడు
తట్టుకురాజా యేడుబండ్లు కట్టించినాడు
పీనుగులైన యెత్తించినారు ప్రాంచిదొరగారు
మూడుచెరువులే మిక్కుటమైనాదిపీనుగలంతాను
కోటయంతా శుద్ధిపరచెను విజయరామరాజు
తెల్లవారితే రాజుగారికి పట్టము గట్టుతాము
డేరావద్ద వచ్చినారు యిద్దరు యపుడుదా
దిగులుతీరి డేరాలోగా వారే యున్నారు
వీరికథలా యిలాగున్నది బొబ్బిలిలోగాను
మూడురోజు దాకలైనాది వెంకటలక్షుమమ్మ
రాజారము చేరినాది వెంకటలక్షుమమ్మ
పరాకుంచక వినుము యిపుడు పాపారాయుడు
నిండుకొలువున యున్నాడండి పాపారాయుండు
బాలునియపుడు చేతికిచ్చెను వెంకటలక్షుమమ్మ
అప్పుడేమని యడిగినాడు పాపారాయుడు
బావగారు రంగయ్య దొరలు వస్తుయున్నారా
అప్పచెల్లెలు మల్లమ్మదేవి వస్తుయున్నారా
పల్లకిలేదా సవారిలేదా వెంకట్రాయుడికి

వొంటిబాటగా రావనేలా వెంకట లక్షుమమ్మ
వొంటిగాను వెంకట్రాయుని యెత్తుక వస్తివి
అట్టిమాటలకు యేమన్నాది వెంకటలక్షుమమ్మ
పరాకుంచక వినుమువీరు పాపారాయుడా
కోటవిడిచి మీకోటకొచ్చిన తొమ్మిదోనాడు
కోటకు దికె దళము తెచ్చెను విజయరామరాజు
యెంచిచూడక ప్రాంచివారిని తెచ్చిపెట్టెను
కోటకు నాలుగుప్రక్కల ముట్టడించినారు
మూడుదినములుదాక యుద్ధము జరుగుతున్నాది
మీచోటికి పంపినారు దేవి మల్లమ్మ
ఈమాటలు విన్నాడయ్యా పాపారాయుడు
యెంచరాని కోపము గలిగె పాపారాయుడు
యెంచరాని శౌర్యము గలిగె పాపారాయుడు
యింతపనికి వచ్చినాడా విజయరామరాజు
నేను కోటలోపల లేకచూచి విజయరామరాజు
కోటకైనా కొలువువచ్చైనా విజయరామరాజు
ఈబాటలో వస్తాడని బాటకాచినాను
దొంగముచ్చు దుమికినాడు విజయరామరాజు
మూడుదినములనుంచి యుద్ధము జరిగితేను
కబురులేక చేసినాడా రంగారాయుడు
కబురులేక జేసినాడా వెంగళరాయుడు
రాజుగారు వచ్చిన సమయము జూచెదా
కొంచంసంగతి చెప్పకపోతివి వెంగళరాయుడా
నల్లయేరు దాటనిస్తునా రాజును నేనుదా
యింతసేపు నిలువనిత్తునా కోటల క్రిందాను
తట్టుకోటకు బలియిస్తును రాజును నేనుదా
పుట్టుకోటకు బలియిస్తును ప్రాంచిని నేనుదా
యెరుకలేక చేసినాడు వెంగళరాయుండు
మంచిదన్నాడు బాగన్నాడు పాపారాయుడు

తన్నుకొలిచే రాణువలంతా తాను పిలిచినాడు
సింహాసనము వేసెనయ్యా వెంకట్రాయునికి
సింహాసనముమీద కొలువుతీర్చెను బాలునిగను కాను
పరాకుంచక వినండిమీరు యల్మాదొరలారా
కాశిప్రయాణం తగిలిందయ్యా యల్మాదొరలారా
మూడు నెలలు కాశియాత్రలు పోయివస్తాము
ఆరు నెలలు జీతమంత యిప్పుడే యిచ్చేను
ముందు నిలచి వందనమొసగెను వెంకట్రాయునికి
చిన్ననాటి స్నేహితుడయ్యా మద్దాల వెంకన్న
మద్దాల వెంకన్న యనేటివాని కొలువుకు పిలచెను
సేవకుడైన మిర్యాల సీతన్న కొలువుకు పిలచెను
కాశియాత్రల బోయివత్తాము మనము నేడుదా
మంచిదన్నాడు బాగన్నాడు మద్దాల వెంకన్న
అప్పుడేమని చెప్పినాడు పాపారాయుడు
అన్నలార తమ్ములార యల్మాదొరలార
చక్కగా చాకండయ్యా వెంకట్రాయున్ని
నారీతిగా వెంకట్రాయుని జూస్తువుండండి
పరాకుంచక వినవేతల్లి వెంకటలక్షుమమ్మ
బాలుని యిపుడు సాకుతుండవె వెంకటలక్షుమమ్మ
ఈరీతిగా చెప్పినారు ప్రయాణమైనారు
మా గ్గురును గుర్రమెక్కి ప్రయాణమైనారు
కొందదూరము కాశియాత్రలు వారుసాగించినారు
అక్కడనుంచి వచ్చినారుగా బొబ్బిలికైతేను
బొబ్బిలివారి దేవిడీముందర రక్కసమండ్యాలు
రక్కసిమండ్యాల వద్దిమానులకే గుర్రమునుగట్టిరి
కోటలక్రింద యపుడువచ్చిరి ముగ్గురు యపుడుదా
కోటలోపల నాలుగుప్రక్కల కన్నుల చూచిరి
మల్లమ్మదేవి రాజదివాణమునకు కదలివచ్చిరి
దీపము బెట్టను దిక్కులేదయ్యా కోటకులోగాను

ఘోరము ఘోరమున దుఃఖించినాడు పాపారాయుడు
చాపకత్తు దరవాజా కుండ బైటికివచ్చిరి
చెరువులోకి కదలివచ్చె పాపారాయుడు
కోటపీనుగుల లోపల వెతకిపట్టినాడు
అప్పచెల్లెలు మల్లమ్మదేవి శిరస్సుగనుకాను
దహనమపుడు చేసినాడయ్యా పాపారాయుడు
నిమిషంబున నిత్యకర్మంబు తాను జేసినాడు
గుఱ్ఱాలముందు వచ్చినాడు పాపారాయుడు
పరాకుంచక వినుము మీరు మద్దాలవెంకన్న
వొంటివారి మనప్రాణము గుఱ్ఱాలుయెందుకు
వారివారి గుఱ్ఱములుపట్టి యప్పుడే చంపిరి
యోచనలు చేసినాడయ్యా పాపారాయుడు
తూర్పుసీమ రాజుల వేషము వారు వేసుకొన్నారు
రొమ్మునందు జంజము వేసిరి ముగ్గురుయపుడుదా
బొమ్మంచులు దోవతులు యపుడు బిగియగట్టినారు
గోదుమమాలున్ను ధరించినారు ముగ్గురుగనుకాను
అచ్చటనుంచి వచ్చినారయ్యా ముగ్గురు యపుడుదా
కాగితము ను పేనాయపుడు చేతనుబట్టిరి
అన్నకొడుకు ఆనందరాజు జాబువ్రాసినట్లు
దొంగజాబు వ్రాసినాడయ్యా పాపారాయుడు
లకోటాలు చేసినాడయ్యా పాపారాయుడు
సేవకుడునొకడు జేతికిచ్చెను జాబును యపుడుదా
పరాకుంచక వినుము యిపుడు మిర్యాలసీతన్న
అటకాయంపు లేకుండా నే డేరాకుపోతేను
రాజుకొల్వున జాబులుబెట్టి వందనమొసగండి
జాబుకయినా నేనువస్తాను మిర్యాలసీతన్న
ప్రొద్దుగ్రుంకి జాముప్రొద్దు అప్పుడేయున్నది
అలసిసొలసి నిద్రపోతారు రాజులందరుదా
దిగులుతీరి నిద్రిస్తాడు విజయరామరాజు

తెల్లవారితే రాజుగారికి పట్టముగట్టుతారు
ఫ్రాంచివారి డేరాలకు కదలివచ్చినారు
ఫ్రాంచివారి డేరావిడిచి రాజుడేరాకుదా
రాజుగారి డేరాలకు యప్పుడెవచ్చిరి
ముప్పైయింటికి రవుతులు యపుడు వగదిపోదారు
ముప్పైమందితో కలుసుకొన్నారు యప్పుడుదా
అటకాయింపు లేకుండనె యప్పుడె పోయిరి
ముప్పయింటికి పరిదిజేసు నురల పోతారు
రాజుకొలువున నిలచినారు ముప్పైను యపుడుదా
కన్నుసైగ జేసినాడు పాపారాయుడు
అప్పుడుపమని చెప్పినాడయ్యా మిర్యాలసీతన్న
రాజుకొల్వున జాబులుబెట్టి వందనమొసగెను
యెవ్వరితాలూకా యన్నాడండి విజయరామరాజు
అంతలోపల అందుకొన్నాడు పాపారాయుండు
పరాకుంచక వినండిమీరు రాజుగారుదొరలు
పూర్వదేశం రాజులమయ్యా విజయరామరాజు
కొలువులేకనే విజయనగరము కొలువుకువచ్చితిమి
మీయన్నకొడుకు ఆనందరాజు యేలుతుయున్నాడు
మీగొక్క- బేటికి పొమ్మన్నారు ఆనందరాజు
మంచిదన్నాడు బాగన్నాడు విజయరామరాజు
జాబునుయపుడు జూచినాడయ్యా విజయరామరాజు
ఆనందరాజు వ్రాసినట్లు వ్రాతలుయున్నాది
ప్రొద్దుపోయినాది ఇప్పుడు మీతో మాటలుయెందుకు
తెల్లవారి బేటికివస్తె మువ్వురికైనాను
తగినట్లుగాను జీతము మీకు నేనుఇస్తా
పప్పుబియ్యం యిస్తానయ్యా ముగ్గురకైనాను
బోంచేసుకొని వుదయమందు నాబేటికి రన్నండి
యిట్టిమాటలు చెప్పినాడయ్యా విజయరామరాజు
పప్పుబియ్యము తీసుకొనిదా బైటికివచ్చిరి

పరాకుంచక వినుమయ్య మిర్యాల సీతన్న
డేరాబైట పవ్వళియ్యం మొగచల్లినాపూ
ముగ్గురును పవ్వళించిరి ఆఘడియలోన
అలసి సొలసి నిద్రపోయిరి ముగ్గురు అపుడుదా
కలలోవచ్చి యేమన్నాది దేవి మల్లమ్మ
పరాకుంచక వినుము యిపుడు పాపారాయుడా
క్రూరకర్ముడు కులద్రోహుడు విజయరామరాజు
కానిపోని మాటలవల్ల నన్ను దూరినాడు
ముండమోసితె మూడుగ్రామనాల్ ఇనాములిస్తా
ముందరికూడు మానుకొనగూడ్డ నీదేనున్నాడు
ఈలాగున తిట్టినాడయ్య విజయరామరాజు
రాజు నిద్రపోతున్నాడు విజయరామరాజు
యిది సమయంబు యిదివేళరా పాపారాయుడా
తట్టియపుడు లేవగొట్టెను మల్లమ్మదేవిదా
తటుక్కున నిద్రలేచెను పాపారాయుడు
గాలుసైగ చేసినాడు పాపారాయుడు
ముగ్గురున్ను త్రుళ్ళిలేచిరి యపుడున్ను
పడకలోనె దట్టిగట్టి ముగ్గురు యపుడుదా
డేరాయపుడు చింపినారయ్య ముగ్గురు యపుడుదా
డేరాలోపల జొరబడ్డారు ముగ్గురు యపుడుదా
మీరాసాయబు గస్తుయపుడు తిరుగుతు యున్నాడు
చలోయంటు చప్పుడిస్తుంటు మొగాట వచ్చినాడు
నీడవాతు వచ్చిందయ్యా మద్దాల వెంకన్న
మొలనుయున్న బాకును యపుడు దబ్బున తీసెను
గొంతుయందు బొడిచినాడు మద్దాల వెంకన్న
గిరగిరమని తిరిగి యపుడు భూమిన పడ్డాడు
రాజుబేటికి వస్తున్నాడు పాపారాయుడు
రాజుగారి సేవకుడయ్యా చల్లారాముండు
పాపారాయుడు వస్తున్నాడు చల్లారాముండు

చలోయంటు చప్పడిచుంటు మొనాట వచ్చెను
సిరువంతు వచ్చిందయ్యా మిర్యాల సీతన్న
పచ్చలబాకు సమయమునుంచి భగ్గునతీసెను
వానినోట పొడచినాడయ్యా మిర్యాల సీతన్న
పొడచినంతలో తిరిగి తిరిగి భూమిన పడ్డారు
రాజుగారు నావంతన్నారు పాపారాయుడు
వాని రొమ్ముమీదనే కొలువు తీరెను పాపారాయుడు
కాళ్ళుయపుడు గట్టిగ పట్టెను మిర్యాల సీతన్న
శిరస్సు యపుడు గట్టిగపట్టెను పుద్దాల వెంకన్న
అప్పుడేమని చెప్పినాడు పాపారాయుడు
తట్టితట్టి లేపెనయ్యా విజయరామరాజుని
మెలకరించి లేచినాడయ్యా విజయరామరాజు
వోరో యీాటిమొక్క డ బల్లెమొక్కడ చల్లారాముడా
యోరి యీాటిమొందకు బల్లెమొంకను విజయరామరాజు
పక్కలోనే బాకై యున్నాను పాపారాయున్ని
సీతలగుండై యున్నాను పాపారాయున్ని
దొంగబాట వస్తివిగదర విజయరామరాజా
బొబ్బిలికోట తీస్తామని ప్రతిజ్ఞ చేసితివి
రెవ్వరిపంతము సాగిందోయి విజయరామరాజు
యిట్లు చెప్పుతు బాకుతీసెను పాపారాయుండు
రొమ్ముమీాద గుమ్మినాడయ్యా పాపారాయుండు
గుభల్ గుభళ్ళని రక్తమువచ్చి జీవము విడిచెను
భూమిమీాదనే దోసినాడయ్యా మంచముపైనుంచి
డేరావిడిచి బైటికి వచ్చిరి మువ్వురు యపుడుదా
బొబ్బిలి పులివచ్చెనని కూతలుబెట్టె
కలవ్వరించి నిద్రలేచిరి రాజుల దండుదా
వొక్కరిబల్యము యిద్దరు బట్టిరి దండుకులోగాను
అన్నయని తెలియకుండ తమ్ముడు జంపెను
ఆలగోడు బాలగోడాయె దండుకులోగాను

కల్వరించి నిద్ర లేచెను ప్రాంచిదొరగారు
రాజగారి దండుకులోగా సందడివిన్నారు
ప్రాంచివారి బేటికివచ్చె దుబాసి లక్షుమయ్యా
నన్నుపిలచిన కార్యమేమి ప్రాంచిదొరగారు
రాజుగారి దండుకులోగా సందడి యేమండి
పన్నెండు లక్షలపైకము మీరు యివ్వవలెనండి
పైకం కట్టవలెనెంచి పైకివస్తాడు
వంచుమయ్యా వంచుమయ్యా భీరంగిలపుడుదా
యుంచు సట్టి మందుగుండు గెట్టనచేయండి
మందుగుండు వేసియప్పుడు గెట్టనచేయండి
మందుగుండు వేసియప్పుడు గెట్టనచేసిరి
పళపళ యని కాల్చినారు భీరంగి లంతాను
పిలుచుటకు యెవరులేరు రాజుదండులోగా
మూడునిమిషములు తమాషజూచె పాపారాయుండు
నాదుమాటలు వినండిమీరు మద్దాల వెంకన్నా
నొంటరిగా నిలచితిమి మనకు కోటలు యెందుకు
అన్నతమ్ములు బావమరదులు యందరు చచ్చిరి
రాజుగారిని జంపినాము పేరుజెందినాము
రచ్చాబండా గేపులకాడ పాపారాయుడు
మండివేసి కొలుపుతీరెను పాపారాయుడు
బాకుయెత్తి రొమ్మునగుద్ది భూమిన యొరిగెను
వానివెంటనే కొలుపు తీరెను మద్దాల వెంకన్న
బాకుయెత్తి రొమ్మునపొడిచి భూమిన పడినాడు
యందరును చచ్చినారయ్యా ఆనిమిషంబులోన
పాపారాయుడు చచ్చినసంగతి ప్రాంచి యెరిగెను

రాజుగారిని చంపినసంగతి ఫ్రాంచి యెరిగెను
యికను యెందరున్నారో బొబ్బిలికోటలో
నిమిషమైన యుండగూడదు కోటలకంతాను
కట్టినారయ్యా డేరాలంతయు గాడిబండ్లమీద
యెత్తినారయ్యా డేరాలంతా యెద్దులమీనాను
యిరవైనాలుగువేల దళములతో ఫ్రాంచివచ్చినాడు
మున్నూటితో తిరుగ మళ్లెను ఫ్రాంచిదొరగారు
రాజమహేంద్రము జిల్లాచేరెను ఫ్రాంచిదొరగారు
ఆనందరాజుని ఫ్రాంచి పిల్వబంపెను
ఫ్రాంచివారి బేటికివచ్చి సలాంచేసెను
యిద్దరున్ను కుర్చీమీద కొలువు తీరినారు
పిన్నయ్యోడి పిన్నయ్యోడి ఫ్రాంచిదొరగారు
తెల్లవారితే రాజుగారికి పట్టము గట్టుతాము
స్త్రీహత్యయు పన్నెండులక్షల పైకము కట్టవలెను
తెల్లవారితే పన్నెండులక్షల పైకము కట్టవలెను
యింతలోన చెల్లుకొన్నాడు విజయరామరాజు
ముందుపైకము గట్టినవెనుక మీరే లేవండి
నమ్మివచ్చెదా తోడ్కొనిపోతిని ఫ్రాంచిదొరగారు
బొబ్బిలివారిని చంపినావు ఫ్రాంచిదొరగారు
యీరీతిగా చెప్పినాడయ్యా ఫ్రాంచిదొరగారు
కైదులోపల వుంచినాడయ్యా రాజును గనుకాను
అప్పుడేలాగున్నాడండి ఆనందరాజు
మంచిమంచి యేనుగులను యమ్మివేసినాడు
మంచిమంచి గుఱ్ఱములను యమ్మివేసినాడు
ఆరులక్షలపైకము యప్పుడె చెల్లించెను

పైకమప్పుడు పుచ్చుకొని ఫ్రాంచిదొరగారు
పుదుచ్చేరి చేరినాడయ్యా ఫ్రాంచిదొరగారు
వారికథలు ఆలాగున్నది పుదుచ్చేరిలోన
అప్పుడేలాగున్నాడయ్యా వెంకట్రాయుడు
రాజారము యేలుతున్నాడు వెంకట్రాయుడు
యాభైముగ్గురు యల్మాబిడ్డలు వెంటనెయున్నారు
పినతల్లి జగ్గమ్మదేవి వెంబడియున్నాది
పన్నెండేండ్లు పోయినసంగతి యేమి జగ్గమ్మదేవి
యెన్నడురాని కోపముకలిగె వెంకట్రాయుడికి
అంతపనికి వచ్చినాడా విజయరామరాజు
పుదుచ్చేరి యేలేటివాడు ఫ్రాంచిదొరగారు
మాకోటలు కొలుపుచ్చెనా ఫ్రాంచిదొరగారు
అచ్చటినుండి వచ్చినాడయ్యా వెంకట్రాయుడు
తన్నుకొలిచె రాణువలంతా తాను బిలచినాడు
యాభైయువ్వరు యల్మాదొరలు వెంటతీసుకొని
గుఱ్ఱమప్పుడు యెక్కినాడయ్యా వెంకట్రాయుడు
యాభైగువ్వరు యల్మాదొరలు వెంబడివస్తారు
గోల్కొండ చేరినాడుగా వెంకట్రాయుడు
బాదుషావుల దర్శనముకాడ కాచియున్నాడు
ఆలోచన చేసినారు వెంకట్రాయుడు
పడమటిశీమ హుండిసూకలు వస్తువున్నది
కనమకాచి యున్నారయ్యా వెంకట్రాయుడు
అచ్చటనుండి వచ్చినారయ్యా హర్కారులపుదుదా
బాదుషావుల బేటికివచ్చె హర్కారులపుదుదా
సలామయ్యా సలామయ్యా బాదుషాదొర్లగారు

పడమటిశీమ హుండీరూకలు దీసుకొచ్చినాము
కనముగాచి యున్నాడయ్యా యీవేళలోగా
అట్టిమాటకు యేమన్నాడు బాహద్దారగారు
హుండిరూకలు కొట్టెవాడు యెటువంటివస్తుంది
యేసూటిదండు వెంటతీసుకొని బాహద్దారగారు
కనుమకాడికి వచ్చినాడయ్యా బాహద్దారగారు
కుర్చీమీద వున్నాడండీ వెంకట్రాయుడు
బాహద్దావుల కన్నులచూచె వెంకట్రాయుడు
యెదురుసేవకు యేడడుగులు ముందుగనడిచెను
యెవ్వరితాలూకా యన్నారయ్యా బాహద్దారగారు
బొబ్బిలివారి తాలూకాయని తానుచెప్పినాడు
బొబ్బిలివారి తాలూకాయంటె నీవెవ్వరుయన్నాడు
రంగయ్యదొర కుమారుడు వెంకట్రాయుడు
హుండీకొట్టిన సంగతియేమి వెంకట్రాయుడా
బొబ్బిలికొట్టిన సంగతియేమి బాహద్దారగారు
రాజుగారిని ప్రాంచివారిని పామీలంపితిమి
బొబ్బిలికోట కోలుపుచ్చిరి బాహద్దారగారు
ఆరునెలలు దర్బారుకాచి బాహద్దారలుదా
నీదర్శనమునకు కాచియుంటిని బాహద్దారలుదా
నేటివరకు కనుమకొట్టి కాచియుంటినయ్యా
నాకోటలు కోలుపోయి పన్నెండేండ్లాయె
తల్లిగారు మల్లమ్మదేవి యులసటబంపింది
అప్పుడునేను సంవత్సరముబిడ్డ బాహద్దారగారు
గారాబంబున బెరిగినేను బేటికివచ్చితిని
యెప్పటివలె బొబ్బిలికోట మాకేయివ్వండి

విన్నతోడనే కోపమువచ్చె బాద్షాపుల కపుడుదా
దుబాసి లక్షుమయ్యకు జాబుపంపెను
బాలునియెత్తి వొడిమీదపెట్టి ముద్దులాడినాడు
యేనుగమీద అంబారికట్టించినాడు
అంబారిలోన కొలువుతీర్చిరి వెంకట్రాయున్ని
నాలుగువీధులు త్రిప్పినాడయ్యా వెంకట్రాయున్ని
యుల్బాయలు యిచ్చినాడయ్యా బాద్షాదొరగారు
రెండువేల రాణువలంతయు వెంటతీసుకొని
బొబ్బిలికైనా వచ్చినాడయ్యా బాద్షాదొరగారు
యెప్పటివలెనె బొబ్బిలికోటలు పట్టంకట్టెను
రత్నఖచిత తగత్తుమీద కొలువుంచినారు
చేతనున్న శిఖావుంగరము చేతబట్టినాడు
యెప్పటిలాగు బొబ్బిలికోటలు యేలుతుయున్నాడు
అప్పుడేమని చెప్పినారయ్యా బాద్షాదొరలుదా
నీతండ్రులు పిన్నతండ్రులు వెంకట్రాయుడా
నాకెరుకచేయక కొం వుచ్చుకొన్నారు
అలాగు చేయవద్దురా వెంకట్రాయుడా
నెలకు నెలకు రాజడిగిన మొక్కసంగతులై తేను
నాకు తెలియపర్చండయ్యా వెంకట్రాయుడా
కోటమీదుకు పరాయిదొర తాయిగ వచ్చితేను
కావలసిన సిబ్బందులు నేను పంపుతాను
యోచనలేక పనులుమీదు చాయవద్దయ్యా
ఈరీతిగా బద్ధులైన మాటలు జెప్పెను
అక్కడనుంచి ప్రయాణమాయెను బాద్షాదొరలు
గోల్కొండకు వచ్చినారయ్యా బాద్షాదొరలుదా

దుబాసివారి లక్ష్మన్నయ్యను కొలువుకు పిలవాచ
ప్రాంచివారిని నమ్మక నేను దుబాసి లక్ష్మన్నడా
నిన్ను నేను పంపనైతి దుబాసి లక్ష్మన్నడా
మోసముచేసి బొబ్బిలికోట కొలుపుచ్చినావు
వానిని యేనుగయొక్క కాలుక్రింద త్రొక్కించినారు
బొబ్బిలికోట యేలుతున్నాడు వెంకట్రాయుడు
రంగరంగ వైభోగముతో యేలుతువున్నాడు
శృంగారముగా బొబ్బిలికోట యేలుతువున్నాడు
చదివినవారు విన్నవారును భాగ్యంబును
పుత్రభాగ్యముగలిగి భూమిలో పొందాగ యుందురు
శత్రుహాతము జేతుర కార్య సొంపుగా జదివితేను
వ్రాయనైతి బొబ్బిలివారి వాంచన కథలుదా
తప్పులొప్పు లున్నప్పటికి దయగుండి నాపై
దప్పులుదోవ వొప్పులు మీదయతో జేసుకొనిన
శ్రీహరివారికి సకలసంపదలు సిద్ధమై చేయును
బాయక నెప్పుడు గలుగును వారికి భోగభాగ్యములు.

పెద్ద బొబ్బిలి రాజు కథ

సంపూర్ణం.

